దిక్కుమాలిన దైవంబు ♦ "తెచ్చిపెట్టె
నిట్టి యిక్కట్టు లౌరౌర! ♦ యేమి తగవు? ౬౬

కాలు నిచిన యూరు ♦ కారూరు పురిటిల్లు
పాలుటాకుటోర ♦ పాకపంచ
పురుడు పోయు తల్లి ♦ మునిపల్లెలోఁ బుట్టి
యేమి తెలియనట్టి ♦ యెడ్డెకత్తె. ౬౭

ఉగ్గుఁ బాలు పోసి ♦ యుండరా నాయన్న!
యేడ్వఁబోకు మంచు ♦ నేడు పుడిపి
పూలతొట్టెఁ బెట్టి ♦ బోరుకాడింమట
యడవిపల్లెఁ బుట్టి ♦ నట్టి పడుచు. ౬౮

జోజో యటంచును ♦ జోలపాటలు పాడి
పొదిగిళ్ళలో బిడ్డఁ ♦ బొదిగి పెట్టి
వినరాని పాటలు ♦ వినిపింప విననయ్యె
దిక్కుమాలిన నాకుఁ ♦ దెరువు లేదు
తులలేని బంగారు ♦ తూఁగుటుయ్యాలలో
ముందూఁగవలసిన ♦ ముద్దుబిడ్డ
కడిమి చెట్టులక్రిందఁ ♦ గడిమిలోఁ గట్టిన
తీగటుయ్యాలలో ♦ నూఁగవలసె

ద్రవిడ రాజన్య రత్న సం ♦ స్థగితమైన
పైఁడిగద్దెపైఁ గూర్చుండు ♦ వాఁడు నేఁడు
కాడులో మునిపల్లెలో ♦ గాపురంచు
నెవ్వ నాలించువా రొక్క ♦ రేని లేరు." ౬౯

అని యిట్లు చింతించుచు, నిఁటివేల్పునకు మ్రొక్కులిడుచుఁ దలఁపులు నలుదెసలకుఁ జెదరిపోవఁ జేయునది లేక, యాయాస

పడుచు, నిందుచూలాలితనంబున దిగులుపడుచు, నాయంతర్వత్ని
కన్నుమూఁత పెట్టుచుండ. ౭౦

మహతి చేఁగొని నారద ♦ మౌనివరుఁడు
తరుణ మరుదెంచె నని చెప్పి ♦ తారి తారి
నాల్గుదిక్కులు పరికించి ♦ నవ్వుకొనుచు
నిట్లు హృదయమ్ములో నిశ్చ ♦ యించుకొనియె. ౭౧

ఆభిజాత్యము గల్గిన ♦ యట్టి మాన
వతికి నొకమారు తలకెక్క ♦ మతపుఁ బిచ్చి
యెట్టి పనియైనఁ బొనరించు ♦ నీశునాన
మానవుని వల్లఁగా దామె ♦ మనసుఁ ద్రిప్ప. ౭౨

కావున నేయుపాయమును ♦ గైకొని యైనను మంచిమాట లే
వో! వినిపించి మావలకు ♦ నొప్పుగ నామెను ద్రిప్పుటొప్పు, లే
దా విడిపోవు మాపనులు ♦ తప్పదు గావున నీమెచేతనే
పోవడిఁగూర్తు ద్రావిడుల ♦ కంచును నారదమౌని యంతటన్.

పున్నమరేయి యాశ్రమము ♦ పొంతను మెల్లఁగ సన్నగాలి పే
రెన్నిన సన్నజాజిపొద ♦ రిండ్లపయిం బడి వీచుచుండఁగాఁ
గిన్నరసాని యెల్గుఁగొని ♦ కిన్నెర పల్కఁగ సన్నగొంతుతో
విన్ననువొప్పఁ బాట విని ♦ పింపఁ దొడంగె మనోహరంబుగా.

పతియెడఁబాటుచేఁ గలుగు ♦ బాధ విరోధిగృహప్రవాస దు
ర్గతి కలగింప నేమియెఱుఁ ♦ గంగని చిత్తముతోడ నాపతి
వ్రత వినుచుండె నారదుని ♦ పాటల నేమరి మెల్లమెల్లఁగా
మతి చెడిపోయె నొక్కగతి ♦ మ్రాన్పడిపోవఁగ ఱిచ్చపాటుతో.

ఇదె! మంచిపాట పా ♦ డుదు నంచుఁ జెప్పి య
ష్టాక్షరీమంత్రంబు ♦ నాలపించు

ఇదె! గొప్పకథయంచు ♦ నింపుగా సొంపుగా
వైష్ణవగాథలన్ ♦ వరుసఁబెట్టు
ఇదె! మేలుసుద్ది చె ♦ ప్పెద నంచు మురువుతో
నార్యరాజచరిత్ర ♦ మట్టె పాడు
ఇదె! లెస్స బుద్ధి ప ♦ ల్కెద నంచుఁ బ్రావడ్డ
ద్రావిడాచారముల్ ♦ తడవుచుండు

కన్ను మూఁతలు పడుచున్న ♦ కాంత యపుడు
వినెనొ! వినలేదొ! రవ్వంత ♦ వీనినెల్ల
నారదుఁడు పూత్రి మట్టె చి ♦ ర్నగవుతోడఁ
జెలఁగి పాడుచుండెను గొంతు ♦ చిరుగునట్లు. ౭౬

విష్ణుకథలఁ జెప్ప ♦ వినరాదు నేనంచుఁ
జెప్పలేకపోయెఁ ♦ జెలియ యపుడు
సంయమీంద్రుఁ డద్ది ♦ చక్కఁగాఁ గనిపెట్టి
విష్ణుకథల నెల్ల ♦ విప్పి చెప్పె. ౭౭

వినఁగ వినఁగ భక్తి ♦ విస్ఫారఁజొచ్చెను
దెలియకుండ నుంత ♦ చెలియ కపుడు
కడకు నేమి కలదు? ♦ గర్భస్థపిండంబు
మార్పుఁ జెందెఁ దల్లి ♦ మార్పుతోడ. ౭౮

తలకెక్కుచుండఁ గ్రిమముగఁ
గలవాణికి మాని బూట ♦ కపునుడువులు వ్యా
కులపా టుడిగి కుతుకమునఁ
గలఁగక యుందుండె బేల ♦ గావున నటుపై. ౭౯

శుభలగ్నంబున నొక రే
శుభలక్షణలక్షితుండు ♦ సూనుం డొకఁడున్

బ్రిభవించెఁగదా ద్రివిడ
ప్రభాపహారుం డగుచును ♦ ప్రహ్లాదుఁ డనన్. ౮౦

నవనవలాడుచుం బెటిగి ♦ నత్తినుడుల్ తడబాటునెన్నడల్
జవజవలాడు మైమెఱుగు ♦ చక్కని చామనిచాయ మేనితో
గవగవలాడుచుండ నెస ♦ కమ్మున నెంతయుఁ గన్నతల్లి తా
నవిరళమోద మంది తన ♦ యా! యిటు రమ్మని పిల్చుచుండెడిన్.

నారదమౌనిశేఖరుఁడు ♦ నమ్మక మొప్పఁగఁ గన్నతల్లికిన్
సారెకుఁ జేరఁదీసి యుప ♦ చారముఁ జేయుచు విష్ణునామముల్
నేరుపసాఁగె బిడ్డ కవ ♦ లీలను దల్లి యెఱుంగకుండ వి
స్తారపువాలకంబునను ♦ దన్నొరు లెవ్వరు చూడకుండఁగన్. ౮౧

ఆరముగ్గిన పండ్ల ♦ నారగింతువు రార
చెట్లచాటున కంచుఁ ♦ జేర్చుచుండు
మంచిమొల్లలు తెచ్చి ♦ మాల గ్రుత్తువ యంచుఁ
బొదరిండ్లదరికిఁ గొం ♦ పోవుచుండు
లేడిపిల్లలఁ బట్టి ♦ యాడింతువా యంచు
దూరదూరమునకుఁ ♦ జీరుచుండు
రంగుపుల్గులఁ జూచి ♦ పొంగిపోదువె యంచుఁ
గాపుకొమ్మలఁ బట్టి ♦ చూపుచుండు
నారదుండు ప్రహ్లాదునిఁ ♦ జీరి యిట్లు
తంత్రిములఁ బన్నసాఁగె ను ♦ ద్దండుఁ డగుచుఁ
గాన నుండుటచే నొరుల్ ♦ గానకుండఁ
గడకు లీలావతీదేవి ♦ కన్నుఁ బ్రామి. ౮౩

శివలింగధారణఁ ♦ జేయవే యని తల్లి
బతిమాల మూఁగమై ♦ పల్కకుండు

శివదేవునకు మ్రొక్కు ♦ జెల్లింపవే యన్న
"ఊఁఊఁ" యటంచుఁ దా ♦ నొదిగియుండు
శివదేవు మంత్రంబుఁ ♦ జెప్పవే యన్నచోఁ
బేరత్తి విష్ణునిఁ ♦ బిల్చుచుండు
నినుఁబట్టి కొట్టింతు ♦ నేనని వచియింప
నుత్తదే యని చెప్పి ♦ యూరకుండు
ప్రబ్బికోలు మొండితనము ♦ ప్రల్లదనముఁ
జూపుచున్న ప్రహ్లాదునిఁ ♦ జూచి తల్లి
మొగము చిట్లించుకొనలేదు ♦ మొదటికాన్పు
గానఁ గనుబొమ్మ ముడివైవఁ ♦ గడఁగలేదు. ౮౪

ఎన్ని పేరు లుండ ♦ హీశున కాతఁడే
పేరఁ బిలుచుచున్న ♦ వినకయున్నె?
పేరులోన నేమి ♦ పెన్నిధి కలదంచుఁ
దిట్టఁబోక సమ్మ ♦ తించెఁ దల్లి. ౮౫

నారదుఁ డిది యంతయుఁ గ
న్నారఁగ లక్షించి మోద ♦ మందుచు నుండెన్
దారుణముగఁ బెఱయింటను
బోరును దాఁగొల్పినాఁడఁ ♦ బో షొమ్మనుచున్. ౮౬

ఈగతి నైదేండ్లేగన్
వాగీశు నను గ్రహంబు ♦ వలన వరంబుల్
దాఁ గొని హిరణ్యకశిపుఁడు
దూఁగాడుచు నడిచిపాటు ♦ తోఁ జొరి నగరున్. ౮౭

పచ్చము పాదునుం దెలిసి ♦ బగ్గున మండి కషాయతాక్షుఁడై
యచ్చెరు వయ్యె దైవగతి ♦ యా మగబీరములేని పంద నే

నిచ్చట లేనటం చెఱఁగి ♦ యేమిమొగంబున మందిరంబులోఁ
జొచ్చి మదీయసాధ్వి నెది ♦ చూచుక ముందలఁ బట్టియీడ్చెరో.

ద్రవిడరాజసింహంబు ప ♦ రాభవంబు
నకట సహియింపనోప దే ♦ మైనఁ గాని
మగలరాజొట నా దండి ♦ మగనిఁబట్టి
తెత్తు మగనాంధ్రు చూడఁ గ ♦ న్నెత్తి వాని. ౫౯

అనుచు నవమానరోషంబునఁ గ్రుద్ధుండై కాల నేలందన్ని.

తలచీరఁ జుట్టి చేతన్
దలతలమను కత్తిఁ బట్టి ♦ తటుకున సైన్యం
బుల నగరంబుననె నిలిపి
కలకల మాపుచు హిరణ్య ♦ కశిపుం డంతన్. ౬౧

కతిపయసాదులంగొని య ♦ ఖండజవంబున నారదాశ్రమ
ప్రతిసరభూమిఁ జేరి యతి ♦ వర్యుని నారదుఁ గాంచి వందనం
బతిశయభక్తిఁ జేసి రయ ♦ మారఁ గుటీరముఁ జొచ్చి వెంటనే
కుతుకముతోడ నందు సుమ ♦ కోమలిఁజూచి సరాగచిత్తుఁడై. ౬౨

అవలేపముతో నింద్రుం
డవకాశముఁ జూచికొనుచు ♦ నవరోధము లే
కవరోధము దూరియిటుల
నవమానముఁ జేసె సాధ్వి ♦ హంతవ్యుఁ డగున్. ౬౩

చూడుము మాహా తేహా పరి ♦ శోషణఁ జేసెద స్వర్గధామము
జూడుము మాహా తేహా కడుఁ ♦ జూడెద భీకరశత్రుసైన్యమున్
జూడుము దేవి! నాబలము ♦ సొంపు విరోధి బలంబు పెంపు నే
నూడగనిబాడఁ జేసెద బి ♦ డౌజుని నాకులఁ బాడుచేసెదన్. ౬౪

హిరణ్యకశిపుం డిటు దేవేరితోఁ బరిభావంబు సేఁగు కార్యక్రమంబు నివేదించుచుండ.

చిడిముడిపడు చదుగడుగునఁ
దడబడుచున్ గొణిఁగికొనుచుఁ ♦ జందఱపడుచున్
మిడిసిపడుచుఁ బ్రహ్లాదుఁడు
వడివడి నడతెంచి తల్లి ♦ వంకకు నడుచన్. ౯౬

హిరణ్యకశిపుం డానందాశ్రులు చిందుచుండఁ బరవశుండై బాలకు గ్రుచ్చియెత్తి ముద్దాడుచుఁ, చుబుకంబుఁ బుణుకుచుఁ దడబడు నడలు, బుడిబుడినుడులు, మంటిబ్రుంగిన యొడలు, మురిపెంబు గడలుకొలుప, ౯౭

పుత్రగాత్ర పరిష్వంగ ♦ భూరిసుఖము
నందు నోలాడి మఱపుతో ♦ నట్టె నిలిచి
కడకుఁ బ్రియురాలితోఁ దన ♦ కొడుకుతోడ
వెంటనే పయనం బయి ♦ వీడు చొచ్చె. ౯౮

జైత్రయాత్ర చాటించి, ప్రస్థానభేరి వేయించి, మహాసైన్యంబుతోఁ ద్రివిష్టపంబుపై దాడివెడలి, తన్నగరంబు వలఁజుట్టియున్న, మిఱ్ఱుపల్లంబులకుఁదొలంగి, సమప్రదేశంబున దండు విడియించి, కోటకు లగ్గలువట్టి, యత్యల్పకాలంబున సాధించి, పలువురు చూచుచుండ, శచీదేవి కట్టెదుట నింద్రునిఁ జెఱఁబట్టి దక్షిణాపథంబునకుం గొనితెచ్చి వెట్టిపనియందు నియోగించి, యతని మొత్తుకోళ్లతోఁ బాటు లీలావతీదేవి వేడికోళ్లు కరుణార్ద్రచిత్తుఁడై యంగీకరించి, విడిచిపుచ్చె. ౯౯

అఖిల దిగ్దేశవిజిగీషుఁ ♦ డై హిరణ్య
కశిపుఁ డైదారుగాదులు ♦ కడపిపుచ్చి

పిదప నుదుకు చల్లారఁగా ♦ విశ్వమెల్లఁ
జిక్కు లెడఁబాపి రాజ్యంబుఁ ♦ జేయుచుండి. ౧౦౦

ఒక్కనాఁడు రాకుమారుని విషయమై యోజించి, బాలుని విద్యాప్రసంగమున సంస్కరించుట యుత్తమంబని నిశ్చయించి. ౧౦౧

పూర్ణముగ నీతిశాస్త్రంబు ♦ బోధపడదు
ప్రౌఢమంత్రాంగ మెఱుఁగంగ ♦ వలనుపడదు
రాకొమరుఁడు చదువకుండ ♦ రాదు గానఁ
జదువు నేర్పింతుఁ గొలపుటా ♦ జ్ఞకడ నంచు. ౧౦౨

పదియేనేఁడులు చెల్లిపోయిన సరే ♦ వాకాటులం జిక్కి చొ
క్కి దివారాత్రములట్టె బాలకుఁ డహో ♦ క్రీడించుచున్నాఁ డదే
చదువుల్ నేర్పినఁగాని పోవదు మనో ♦ జాడ్యంబు కాఁబట్టి నేఁ
జదివింపించెదఁ బెద్దయొజ్జలకడన్ ♦ శాస్త్రంబు లన్నింటినిన్.

అంచు విచారించి, సకలనీతిశాస్త్ర పారంగతులును, గులాచార్యులును, నైన శుక్రాచార్య తనూజులగు, చండామార్కుల రావించి కార్యవిషయంబు ముచ్చటించి రాకుమారుని వారల కప్పగించి, పండితోత్తముం జేసి తోడ్కొని రండని యానతీయ. ౧౦౪

మూఁడేండ్లు పోవక ♦ మున్నె శుక్రాచార్య
పట్టి ప్రహ్లాదునిం ♦ బట్టి తెచ్చి
ద్రవిడరాజేంద్రు ముం ♦ దరఁ బెట్టి దీనుఁడై
యితఁ డెట్టి బిడ్డఁడో ♦ యెఱుఁగరాదు
గురుభక్తి గనరాదు ♦ సరకుసేయుట లేదు
శిక్షింతుమన్నఁ దాఁ ♦ బెడ్డకోతి
వనమెల్లను జెఱచు ♦ ననెడి నానుడిరీతిఁ
దోడిబాలురఁ దప్పు ♦ త్రోవఁ బెట్టి

అకట! కులదైవమును దూల ♦ నాడఁ జొచ్చె
పురికథలెల్లఁ బెడచెవిఁ ♦ జేర్పఁజొచ్చె
బాలునకు శిక్ష చెప్పమా ♦ వల్లఁ గాదు
చతురమతి నీవె యెట్లైన ♦ సాఁకికొనుము. ౧౦౫

ఎన్ని చెప్పినఁ దలయూఁచుఁ ♦ డింతయేని
మాఱు పలుకక తనపని ♦ మాత్ర మట్టె
పట్టుఁదలఁ జేయు నిదియేమి ♦ పాపమయ్యొ?
మూఁగవానిని బోధింపఁ ♦ బూను టయ్యొ. ౧౦౬

చదివింపఁగ దొరఁకొంటిమి
చదివించిన లాభమేమి ♦ సమకూడెనొకో!
చదివినయర్థం బెఱుఁగఁడు
చదివింపఁగ లేము మేము ♦ క్ష్మావర! వీనిన్. ౧౦౭

చిరకాలార్జిత విద్యను
బరమార్థముతోడఁ జెప్పఁ ♦ బఠియింపకయే
మఱకువతో నుండును భూ
వర వీనిని సాఁకలేము ♦ పాలసుఁ డగుటన్. ౧౦౮

ద్రవిడజాతి కీతఁడు గుండె ♦ తల్లడంబు
విమల రాజవంశమునకు ♦ వేరువిత్తు
దేవ! దీని నెల్ల నెఱింగి ♦ దిద్దికొనుము
నీదు తొలికాన్పుబిడ్డను ♦ నేర్పుతోడ. ౧౦౯

కావున నీకుమారకుని ♦ గ్రన్ననఁ దెచ్చితి మప్పగింపఁగా
భూవర! యింకమీఁద సరి ♦ పోయినరీతిని దిద్దికొమ్ము, మీ
పావనమైన వంగడపుఁ ♦ బర్వుఁ బ్రతిష్ఠను బాఱఁజూచి లో
కావనదీక్ష నేకరణి ♦ నైన స్వధర్మము నిర్వహింపుమా. ౧౧౦

అంచు వచియించి, చండామార్కులు హిరణ్యకశిపునకు హిత వుం గఱపి, సెలవుం గైకొని, మగిడిపోవ, రాక్షసేశ్వరుండు చింతాక్రాంత చిత్తుండై. ౧౧౧

నయము భయ మనయము ♦ నయముగా బోధింప
మచ్చరంబు హెచ్చ ♦ మానఁ డయ్యె
మొండిపట్టుఁ బట్టె ♦ దండనంబునఁ గాని
సాధ్యపడఁ డటంచు ♦ సాహసించి. ౧౧౨

వాదన లేటికం చు ♦ బలవంతుఁడు తేఁడు కృపం ద్యజించుచున్
గాదిలిపట్టి యుంచుఁ గడ ♦ కంటను జూడక నిష్ఠురక్రియా
పాదనచేత శిక్షఁ బరి ♦ పాటి విధింపఁగఁ జీలిపోయెఁ బ్ర
హ్లాదకుమారమాతుల బ ♦ లంబు చలంబున రెండుపాయలై. ౧౧౩

రాచనగరెల్ల నిట్టిదు ♦ ర్వార్త వినుచు
నట్టుడికినట్టు తుకతుక ♦ లాడిపోయె
నార్య లియ్యది కనిపెట్టి ♦ యార మంచి
తరుణ మాసన్నమయ్యె నీ ♦ సరణి ననుచు. ౧౧౪

నీతికోవిదుల్ గుమిగూడి ♦ నిక్కమెఱిఁగి
దైవగతిచేత గృహములోఁ ♦ దారసిలిన
భేదభావంబు నెటులైన ♦ విస్తరింపఁ
జేయ సమకట్టి నారదుఁ ♦ జీరి చెప్ప. ౧౧౫

మహేంద్రుని చెఱ విడిపించి తొల్లి లీలావతీదేవిని దనయాశ్రమంబున నుంచికొని యుపచారములు చేసి సంతోషపెట్టుటచే నా మానవతీమతల్లి తనయెడ కనికరించి నిరాటంకముగా నంతఃపురమునకు రాకపోకల కనుమతించిన స్నేహంబుఁ బురస్కరించుకొని కార్యోన్ముఖుండయి. ౧౧౬

నారదుఁ డొక్కనాఁడు నర ♦ నాథకుమారకుఁ జూడవచ్చి దై
వారెడిపేర్మిఁ గన్బఱచి ♦ యక్కఱమాటలు నాల్గు చెప్పి వే
యారులు కొండెముల్ పలికి ♦ యాననిపించి సుతార మొప్పఁగా
దూరని తోఁపకుండ మది ♦ దూరని మెత్తనిగొట్టుమాటలన్. ౧౧౭

నీ జనకుండు గర్వమున ♦ నిర్జరకోటిని సాధుపాళి రా
రాజనటంచు నుబ్బుచుఁ బ ♦ రాక్రమలీలఁ గ్రమంబుఁ దప్పి పే
రోజముఁ దూల్చుచుండ నిటు ♦ లోప్పరికించుట రాజనీతియే?
రాజులు లేరె? మున్నిటు ల ♦ రాజకముం బొనరించినారలే? ౧౧౮

యాగము ముక్తినిచ్చునను ♦ నాశమెయిం గదు శ్రద్ధతోడ నా
యాగమవేత్తలందఱు ప్ర ♦ యాసముతో నొనరించుచుండఁగా
యాగము ముక్తినిచ్చునె య ♦ థార్థముగా? నని పాడుచేయు నీ
యాగమునాగడంబు తగు ♦ నా యెడయుండఁగువాని కెందునున్?

బాలుఁడ నే ననఁబోకుము
బాలకునకుమాత్ర ధర్మ ♦ పద్ధతివలదా?
బాలుఁడె ధర్మము నిలుపం
జాలిన దైవంబు మెచ్చి ♦ సంతసపడఁడా? ౧౨౦

నే నెటు లీపనిఁ జేసెదఁ
బోనిమ్మని నీవు చెప్పఁ ♦ బోకుము బాబూ!
వేనకువే లున్నారు మ
హానాయకు లిపుడు నీకు ♦ నండఁగ నిల్వన్. ౧౨౧

తర్కవితర్కముల్ వదలి ♦ తండ్రి పురోహితదండనాథసం
పర్కముచే మహోకఠిన ♦ భావముఁ దాలిచి యొక్కతీరుగాఁ
గర్కశుఁడయ్యె దానఁబ్రజ ♦ కష్టములొందెడుఁగావునన్ శుభో
దర్కముగాఁగఁ జక్కఁబడు ♦ దారిని బోవుట పాడి పుత్రకా!

ఇంతియ కాక. ౧౨౨

దేవరహస్య మొండు విను ♦ తెల్పెద స్వప్నమునందు సర్వలో
కావనదీక్షితుండు చతు ♦ రాగమవేద్యుఁడు నాకుఁ దోఁచి నే
నీవఱ కూరకుంటి నిటు ♦ లే నిఁక సైఁప మదీయభక్తునిన్
బావను నిష్ఠురంబయిన ♦ బాధలు పెట్టుచు నుండ నెవ్వఁడో.

కంటకుఁడై ధరావరుఁడు ♦ కారియపెట్టిన యప్పుడే సభా
మంటపమందు నున్న యతి ♦ మాత్రపు స్తంభమునందు డాఁగి త
న్నంటిన వెంటనే యతని ♦ యాయువుఁ దీసెద నాదుభక్తు నే
నొంటరిఁ జేసి పోవ నెటు ♦ లూరట గల్గునటంచు నాడెఁగా.

కత్తులు నూరినంతటనె ♦ కంపము నొందరు ధీరు లెందుఁ గిం
చిత్తయినం బ్రమాదపడి ♦ సేయ రధర్మము గాన దీని యా
వర్తిఁగించినాఁడ భగ ♦ వంతుని యిష్టముఁ దెల్పినాఁడ నీ
చిత్తము; ధర్మపాలనము ♦ శిష్టసమీహితకార్య మాఁగదా.

రక్షకుఁడొక్కఁడేనియును ♦ రాష్ట్రమునం గనరామి నీప్రజల్
రూక్షభయంబునన్ గలఁగి ♦ రోజొక యేడుగ నున్నవారు నీ
కక్షయసంపదల్ గలుగు ♦ నయ్యు ధ్రువంబుగ నార్తులౌ ప్రజా
పక్షముఁబూని పోరునెడ ♦ బాగని దైవము మెచ్చుఁ బుత్రకా!

ఈగతి నపూర్వరాజనీతి ప్రకారంబు మెఱయ, నారదుండు బోధించి, యలౌకికుం డయిన ప్రహ్లాదునిచే వల్లె యనిపించుకొని సూటిగా విశ్వకర్మమందిరంబుఁ బ్రవేశించి, యొగ్గతంబున మంతనం బాడి నేర్పరులగు పెక్కుర శిల్పుల సమకూర్చి వారికి రహస్యంబుఁ దెల్ప వారును, ౧౨౭

ఎవరికిఁగూడ శంక ఘటి ♦ యిల్లని నేర్పున మెల్పుతోడ రేఁ
బవ లనకుండ నారదుని ♦ పంకము నగ్గెడుభాతి యుక్తిచేఁ
జివరకుఁ దత్సభాస్థలిని ♦ జిక్కని చిక్కని మాటుతల్పులన్
గవిసిన యుక్కుకంబమును ♦ గట్టిరి శిల్పకళావిదగ్ధులై. ౧౨౯

ఆఁకొనియున్న సింగము ర ♦ హస్యముగాఁ గని పట్టి తెచ్చి యే
పోకలు పోవనీక యొక ♦ బోనునఁ బెట్టి యుపాయశాలురై
కైకొని దాని మండపపుఁ ♦ గంబమునం దిరికించి పెట్టి తా
మై కనిపెట్టియుండిరెటు ♦ లౌనొకదా! యని యార్యమాంత్రికుల్-

మఱునాఁడు హిరణ్యకశిపుం డాగ్రహోదగ్రుఁడై సభాముఖంబున గద్దెపైఁ గూర్చుండి, గద్దించుచు "విష్ణుండు, విష్ణుం" డని నిరంతరంబు, వావిడచి, ప్రలపించు చుంటివి. ఆతండెక్కడ యదృశ్యుండయి యడంగియుండెనో చూపింతువా" యనఁ బ్రహ్లాదుండు వికసితముఖుండై నిర్భయముగా "ఇదిగో! నీసభామంటపస్తంభంబుననుండె. చూడనిచ్ఛగింతువేని చూడవే" యనవుడు సార్వభౌముండు మండిపడి తోకఁ ద్రొక్కిన మహానాగంబుకైవడి రోజుచు, గదను బిరబిర సాఁచుచు గద్దెనుండి దుమికి, సాకం బెఱుఁగక స్తంభంబున కేఁపి, యెదురు నడచి బ్రహ్మాండంబు బూరటిల్ల సింహనాదంబు జేసి డాసి యయోమయంబగు దీర్ఘగదాదండంబు గిరగిరఁ ద్రిప్పి పెల్లు మని స్తంభంబు విఱిగి కూల విసరికొట్టెను. కొట్టిన మఱుక్షణంబుననే యదృశ్యంబులగు మఱతల్పులం బడఁద్రోసికొని, ౧౩౦

గర్జించుచుఁ బంచాస్యము
నిర్జరరిపుపైకి దుమికి ♦ నీరవునింగా
జర్జరితాంగుని జేసెను
ధూర్జటిభక్తునకు నేమి ♦ తోఁచకమున్నే. ౧౩౧

అంగద నవయుచుఁ జెంగున
సింగము చెలజేఁగి గోళ్లఁ ♦ జీల్చుచు తేనిన్
గంగారుగఁ జేసి పిదప
నుంగిడి పుట్టించి యట్టె ♦ యుసు రెడఁబాపెన్. ౧౩౨

కొండలు పిండిపిండిగను ♦ గొట్టెడి మేల్పడవాలుదంట కుం
భాండుఁడు హుంకరించి జ్వల ♦ దాతతశాతకృపాణహస్తుఁడై
గండడగించి సింహమును ♦ గాలునిప్రోలికిఁ బంపె వెంటనే
దుండగులెల్ల మ్రానుపడి ♦ దూరఁగఁ దొందర సందుగొందులన్.

పాతరలాడెను నారదుఁ
డాతరి నుప్పొంగిపోయి ♦ యనుకొన్న పనిన్
జాతురితోఁ దీర్చితి నని
చేతం దెగమెఱయుచుండఁ ♦ జటితాళంబుల్. ౧౩౪

అన్నదమ్ము లిర్వురను సిం ♦ హంబుచేత
నేదుపందిచేఁ గూల్పించి ♦ యెగిరిపడుచు
మోదమందె నార్యజనస ♦ మూహ మెల్ల
నెల్లభూములఁ దమయాజ్ఞ ♦ చెల్లుననుచు. ౧౩౫

ద్రావిడరాజ్య మంతయును ♦ దక్కునఁ జేసిన తత్క్షణంబునన్
ద్రావిడులెల్లఁ బోరెదరు ♦ ప్రాణముపైఁగల తీపి మాని రా
జ్యావనదీక్షఁ బూని సమ ♦ రాంగణ మెల్లను బీన్గువెంటలై
పోవఁగఁ గాన నిప్పుడిది ♦ పోలదటంచు మునీంద్రుఁడంతటన్.

రాజనీతివిరుద్ధమై ♦ ప్రాణహానిఁ
జేయు నీకార్య మరయని ♦ షిద్ధమంచు
నార్యులకుఁ జెప్పి యొప్పించి ♦ యవలఁ గార్య
చతురుఁడై దూరదృష్టిచే ♦ సకల మెఱిఁగి. ౧౩౬

కీలుబొమ్మ నొందు ♦ కీలకమ్మున గద్దె
మీఁద నుంచు నెడల ♦ మీఁద మేలు;
ఎల్లలేని నేల ♦ యెల్ల నీతనిపేర
నేలవచ్చు పలుక ♦ నేలయనుచు. ౧౩౯

జాతిద్రోహునిఁ దాతమారకుని వం ♦ శభ్రష్టుఁ బ్రహ్లోమునిఁ
జేతో మోదముతోడ నార్యజనముల్ ♦ సింహాసనారూఢునిం
బ్రాతిం జేసిరి తత్ప్రణాంబ ద్రవిడ ♦ వ్రాతంబు నిర్విణ్ణులై
కాతర్యంబున నేమితోఁచకయె ది ♦ గ్భ్రాంతాత్ములై డాఁగఁగన్.

అతిమతావేశ కలనచే ♦ నాదమఱచి
గురువులకు లోఁగి మతిచెడి ♦ కులముఁ జెఱచి
వంశనాశంబుఁ జేసిరి ♦ పాపమనక
తల్లిబిడ్డ లొక్కటయి పెం ♦ పెల్లఁ బోవ. ౧౪౦

ఆకలంబు నాపడు మాని ♦ యైన నేమి?
యాకులంబుఁ జెందిన వాసి ♦ నందఁ డెందు
నేకలం బీశ్వరునిఁ జేసె ♦ నేకలంబు
నాకలంబునకు జోహారు ♦ లనకయున్న. ౧౪౧

స ం పూ ర్ణ ము.



# య థా ర్థ రా మా య ణ ము.

శ్రీరామాయణకృతిలో
మీ రెఱుఁగని భావమొండు ♦ మిసుకునె? కానన్
గారుణికోత్తమ! చెప్పుఁడీ
శ్రీరామాయణమునఁ గల ♦ చిత్రము లెల్లన్. ౧౪౨

మార్తుర పేరులం దలలు ♦ మాఱిచియున్ దలక్రిందుచేసియున్
నేర్తునటంచు గర్వమున ♦ నిక్కి ప్రచేతసుతుండు తెంపునన్
బూర్తిగ రామచంద్రకథ ♦ మున్ రచియించెనటంచు బాపురే!
వార్త యొకండు నేఁడు విన ♦ వచ్చెడి సత్య మెఱుంగఁబల్కవే.

అనినంతనె సూతమహా
మునిచంద్రుఁడు పల్కెఁ బ్రేమ ♦ మున నిట్లనుచున్
వెనుకటి గాథలఁ జ్ఞప్తికిఁ
గొనితెచ్చికొనుచు మనంబు ♦ కుతుకముఁ జెందన్. ౧౪౪

బిడ్డా! నీసంప్రశ్నము
దొడ్డది; యఖిలంబు చెప్పు ♦ దున్ విను మిపుడే
చెడ్డయు మంచియు తెలిసిన
గడ్డువిశేషంబు లెల్లఁ ♦ గాదనకుండన్. ౧౪౫

పేరులు మార్చినాఁడు తల ♦ పెట్టి దురర్థము రాఁగఁ గొన్నిటిన్
బేరులు మార్చినాఁడు తల ♦ పెట్టి యపార్థము రాఁగఁ గొన్నిటిన్
బేరులు మార్చి మాఱుతుర ♦ పేరు ప్రతిష్ఠను బాడుచేయుచున్
బేరు గడించె నాదికవి ♦ పేరు పొగడ్త జగంబు నిండఁగన్.

"దసగీవ" యనెడి శ ♦ బ్దము దశగ్రీవఁ గా
వించి గొంతులు బంతి ♦ పెట్టినాఁడు

"రావన్న" యనుపేరు ♦ రావణాగాఁ జేసి
బొబ్బమానిసి చేసి ♦ పోయినాఁడు
"చుప్పనాక"ను దెచ్చి ♦ శూర్పణఖం జేసి
చేటగోరులదానిఁ ♦ జేసినాఁడు
"రక్కసి" యనుమాట ♦ రక్షస్సుగాఁ జేసి
యేమేమొ యర్థముల్ ♦ వ్రామినాఁడు

లోకసామాన్యకవియె వా ♦ ల్మీకిమాని?
తలలు తెగమార్చినట్టి ప ♦ దాల నెల్ల
వేఱె యొకనాఁడు చెప్పెద ♦ విస్తరించి
నేఁడు రామాయణాంశముల్ ♦ నీకు వినుతు. ౧౪౭

## ల ం కా పు ర వ ర్ణ న ము.

మూఁడుకాలములందుఁ ♦ బూచి నెత్తావులం
బొలమెల్ల విరఁ జిమ్ము ♦ పూలచెట్లు,
ఆకాల మీఁకాల ♦ మేకాల మనకుండఁ
బగటిల్లి తెగకాయు ♦ పండ్లచెట్లు
మిద్దెమేడలకొద్ది ♦ నిద్దంపు మెఱుగారు
ముద్దుకల్ప నొసంగు ♦ మద్దిచెట్లు
పశుపక్షి మృగకీట ♦ వర్గంబునకు నెందు
నిలువ నీడనొసంగు ♦ నిడుదచెట్లు

తీగగుంపు, గాటంబుగాఁ ♦ గౌఁగిలింప
మిగుల రమణీయమై చూపు ♦ మేరమెఱుకు
వ్రేగువ్రేగుగాఁ గన్పట్టు ♦ విపినభూమి
యిమ్ముకొని యుండు ద్రవిడ దే ♦ శమ్మునందు. ౧౪౮

ఓదములన్న లెక్కఁగొన ♦ కుండ మదంబున గుంపుగుంపులై
గాదముమేయుచుఁ బసరుఁ ♦ గ్రక్కెడి పచ్చని యాకుకొమ్మలన్
బోదెలఁబట్టి తొండముల ♦ బోరలగల్చుచు బృంహితంబులఁ
వాదములాడుచుం దిరుగు ♦ వన్యమదేభ సమూహ మచ్చటన్.

పిడికెడు విత్తనంబులను ♦ విత్తినమాత్రన మూఁడుకారులన్
గడుపున చిచ్చుఁబుచ్చఁగల ♦ కమ్మని మేలిమి పంటపైరులన్
పుడుకులనిచ్చి భూప్రజను ♦ బోషణఁ జేయుచునుండు నెప్డు డీ
పుడమిని దక్షిణాపథముఁ ♦ బోలెడి దేశము వేఱెయున్నదే! ౧౪౦

బుధజనవాసయోగ్యమయి ♦ పుణ్యనదీనదవారి సేవ్యమై
మధురఫలప్రసూన తరు ♦ మండలమండిత దివ్యభాగ్యమై
పృథుతర దివ్యభోగ్యమయి ♦ వెల్గెడి పూతచరిత్ర దక్షిణా
పథమును నంటి దక్షిణపు ♦ వైపున దక్షిణవార్ధియొప్పెడిన్.

నారికేళావనీరుడ్వ ♦ నంబులందుఁ
గాపురము సేయుచుందు ర ♦ క్కడి జనంబు
పరమ సంతుష్టులగుచు నొం ♦ టరము లేక
పరుల యధికార మెట్టిదో ♦ యెఱుఁగఁబోక. ౧౪౨

అఱవము, జానుతెల్గు, మల ♦ యాళము, కన్నడబాస, కోయ, చెం
చెఱుకల గోందు బాసలకు ♦ నెల్లను దొల్లిటిదైన బాసనున్
నెఱిపడి మాటలాడెదరు ♦ నీతిదొఱంగక సంచరింపుచున్
బిరుసున మానరక్షణకుఁ ♦ బిక్కక ప్రాణము పూటవెట్టుచున్

కో యని యార్చి చూడు మిది ♦ గో! యని కొందఘుకీనుకత్తితోఁ
గోయఁ బ్రతీపకంఠములఁ ♦ గొంకరు జంకరు మానరక్షకై
కోయలు చెంచులున్ దులువ ♦ కోటులకోటుబుపోటుమానిసుల్
పాయరు జన్మభూమిఁ దెగ ♦ వైచెద రన్యులు కాలువెట్టినన్

అంకపడి దక్షిణాంబుధి ♦ యంకమందు
లంక, శివలంక, ప్రతిభాంక ♦ లంకవెల్గు
నిత్యనిష్పంక, నిశ్శంక ♦ నిష్కళంక
వంక గానరా దావంక ♦ వంకవంక. ౧౫౫

తొలుత సాలకటంకట ♦ కులజులైన
మాల్యవంతుండు మాలి సు ♦ మాలిమొదలు
గాఁ గలుగువారు లంకలోఁ ♦ గాపురంబు
సలిపి రాజ్యమేలిరి కత్తి ♦ బలిమిచేత. ౧౫౬

నిరంతరపరాజయసంభవావమానంబుచేఁ గుమిలి కుమిలి, విద్వేషులెల్ల రొక్కటయి, దండెత్తివచ్చి మాలింజంప మాల్యవంతుండును సుమాలియు లంకను బాడునెట్టి రసాతలంబునకుం బలాయితులైరి.

పాడువారిన లంకను ♦ బాడుగుడిపి
జక్కు లందుండ వారలఁ ♦ జావమోది
వెడల నడచిరి కోయలు ♦ జడుపునుడిగి
వశముఁ గావించుకొని బాహు ♦ బలముచేత. ౧౫౮

కొంచె మించుమించుగ నాలు ♦ గువయిపులను
నతివిశాలం బగాధంబు ♦ నైన కడలి
యతికి యుండుటచే నారు ♦ ఋతువులందు
వాసయోగ్యంబు లంక యె ♦ వ్వారికైన. ౧౫౯

నిడుదమలమీఁద వాటంపు ♦ నెత్తమందు
గట్టిగా మూఁడుకొమ్మల ♦ నట్టనడుమ
దుర్గమంబుగాఁ గట్టిరి ♦ దుర్గమొండు
కాసె పనిఁగన్న లోకంబు ♦ కన్నుఁగుట్ట. ౧౬౦

అభ్రంకషోత్తుంగ ♦ హర్మ్యసౌధంబుల
పసిడిరోచులు దెసల్ ♦ ప్రాకులాడ
గోపురప్రాకార ♦ కుడ్యరత్నద్యుతుల్
దూఁకి యొండొంటితోఁ ♦ ద్రోపులాడ
రథకేతనాంబర ♦ ప్రథిత కాంతిచ్ఛటల్
తెంపాఱి మింటిపైఁ ♦ దేలియాడ
శింజినీటంకార ♦ శృంగారి ఘీంకార
రావంబు లొండొంట ♦ రాపులాడ

బహుళ చతురంగ వాహినుల్ ♦ పగ్గెలాడ
మూఁడులోకంబులకు గుండె ♦ ముల్లువెలసె
మాట జవదాఁట నేరని ♦ పోటుమగల
కాపురంబైన రమ్య లం ♦ కాపురంబు. ౧౬౧

చల్లని పిల్లతెమ్మెరలు ♦ సాఁగుచుఁ గమ్మని పూవుతావిలో
మెల్లఁగఁ బొర్లిపొర్లి తమ ♦ మేనఁ బుపుం బొడి మేదుకొంచు న
ల్లల్లన కుంటికుంటి నడ ♦ యాడుచు నుండఁగ మింటనుండి జా
బిల్లియుఁ గాయుఁగాఁదఱపి ♦ వెన్నెల హాయిగ నుండు లంకలో.

అంకాపాంకములెల్లఁ జేవదలి ♦ యత్యానంద నిర్మగ్నులై
శంకాతంకవిచారదూరులయు య ♦ శ్రాంతంబు నావీట శౌ
ర్యాంకుల్ వాసము చేయుచుందురుసమ ♦ స్తైశ్వర్యభోగాఢ్యులై
లంకారాజ్య మహావిభూతి గరిమన్ ♦ శ్లాఘింపఁగా శక్యమే?

వెడఁద ఱొమ్ముగల్గి ♦ నిడుద చేతులుగల్గి
మాట యురువుగల్గి ♦ నీటుగల్గి
జిద్దు నేర్పుగల్గి ♦ చిట్టంటు లంకలో
మానటీఁడులైరి ♦ మనుజులెల్ల. ౧౬౪

పదిదిక్కులనుగెల్చి ♦ బహుజయస్తంభముల్
పాతిపెట్టించిన ♦ బల్లిదుండు
పదిశాస్త్రములు గట్టి ♦ పట్టుతోఁ బఠియించి
ప్రజ్ఞాధురీణుఁడౌ ♦ పండితుండు
పదునాల్గు లోకముల్ ♦ బవరాన నోడించి
కాలిక్రిందను బెట్టు ♦ కాలిబంటు
పదియాఱుకళలఁ బ్ర ♦ పంచంబుఁ దనియించు
శశిచెంపఁ గొట్టిన ♦ సౌమ్యమూర్తి

కడుపులో చల్ల రవ్వంత ♦ కదలకుండ
ద్రవిడజాత్యభిమాని య ♦ థార్థవాది
ప్రాజ్య రాజ్యమేలుచునుండె ♦ రావణుండు
దర్పితాహిత లోక వి ♦ ద్రావణుండు. ౧౬౫

పలుగాకి పులుగాకుఁ ♦ బొలివుచ్చి తననాఁడు
చీకాకు పడకుండఁ ♦ జేసినాఁడు
గాటంబుగాఁ జెల ♦ గాటంబుగాఁ జెల
రేఁగి మార్తురఁ జీల్చి ♦ రేఁగినాఁడు
గోపురంబు పురంబు ♦ బాపురే! యన మూఁడు
కొండకొమ్మలమధ్యఁ ♦ గూర్చినాఁడు
కలిచేతఁదన్ని యా ♦. కలిమాన్పి గిలిమాన్పి
నలిమాన్పి మెల్లర ♦ నిలిపినాఁడు

కుదురునకుఁ బట్టుఁగొమ్మయై ♦ కుదిరినాఁడు
నాఁడు తనుఁగొల్వ నొనరించి ♦ నాఁడు నాఁడు
నదురులేని నాయకుఁడై ♦ నాఁడునాఁడు
రావణుం డార్యలోక వి ♦ ద్రావణుండు. ౧౬౬

లంకాపురీంద్రమే ♦ లబ్ధవర్ణన కెంతొ
బడలార్చు బంగారు ♦ పడుకటిల్లు
దక్షిణాపథమే వి ♦ పక్ష పక్షాంతకు
నలరించు నసివారు ♦ నాఁకతోఁట
భారతఖండమే ♦ బాహాబలాఢ్యులు
నవరించి గడితేర్చు ♦ సాముగరిడి
ఖండాంతరంబులే ♦ గానకళావేది
కరియుప్పనములిచ్చు ♦ నట్టిపొలము

ద్రావిడావళి కెవ్వాఁడు ♦ జీవగఱ్ఱ
యతఁడు వీరశైవుండు మ ♦ హాభిమాని
రావణుండు విద్రావితై ♦ రావణుండు
గొనబు జాళువా గద్దెపైఁ ♦ గొలువుఁదీర్చు. ౧౬౭

కోయవారల నాగరి ♦ కుల నొనర్చి
చదువు సాములఁ జెప్పించి ♦ చక్కఁబఱచి
యాభిజాత్యభావోదయ ♦ మ్మలవరించె
నవుర! రావణుం డెంత ధ ♦ న్యాత్ముఁ డగును. ౧౬౮

"అన్నమో రామచంద్రా" య ♦ టంచు నేడ్చు
వా రయోధ్యలోఁ బెక్కురు ♦ న్నారు కాని
"యన్నమో రావణప్రభూ" ♦ యంచు నేడ్చు
వారు లంకలో నెవరు గ ♦ న్పట్టరారు. ౧౬౯

కలఁడు తోఁబుట్టువొక్కఁ డు ♦ క్కలుఁడు రావ
ణునకు జజెట్టి కుంభక ♦ ర్ణుండు, నిదుర
పోతు చిననాఁడె చౌదంతి ♦ పొడుగుకొమ్ము
లొడిసి చేపట్టి యుయ్యాల ♦ లూఁగినాఁడు. ౧౭౦

విపుల తంత్రజ్ఞుఁడైన వి ♦ భీషణుండు
పోకలాఁడు; పెద్ద వదరు ♦ బోతు ఖరుఁడు;
మాఱు తమ్ములు చెల్లెలు ♦ "మాటకారి"
శూర్పణఖ యన్నలకు ముద్దుఁ ♦ జూపుబిడ్డ. ౧౭౧

శైవమతాభిమానియగు ♦ జంగమదేవర గావునన్ సదా
రావణభూవరుండు తన ♦ రాష్ట్రమునందున జీవహింస తా
నేవిధినైన మానుపుట ♦ యే మతధర్మమటంచు నెంచి యే
జీవులఁ జంపఁగూడదని ♦ చేసెను గట్టడి ధర్మలోలుఁడై. ౧౭౨

గొంతెత్తి తొలుసారి ♦ కోడికూయకమున్నె
పురవీథులను నూడ్చి ♦ తిరిగిపోవు
పడకమంచమునుంచి ♦ పశుచు లేవకమున్నె
మెల్లఁగాఁ గలయంపి ♦ చల్లిపోవు
వంటపుట్టియ సిద్ధ ♦ పడి చేరకయమున్నె
నీళ్లతోఁ బంకెలు ♦ నింపిపోవు
ముంగిళ్లు సరిచేసి ♦ ముగ్గుపెట్టకమున్నె
వెన్నాడి ప్రాయిరాజఁ ♦ బెట్టిపోవు

వాయుదేవుండు మేఘుండు ♦ వరుణదేవుఁ
డగ్నిదేవుండు తమయంత ♦ నరుగుదెంచి
ప్రాలుమాలక యేప్రొద్దు ♦ వరవుడంబుఁ
జేయుచుందురు లంకలో ♦ సిగ్గుపడక. ౧౭౩

పాదులు కూలఁద్రోసి పగ ♦ వారల పౌఁజులఁ బట్టి యొక్కఁడే
బాఁదిగుదించి కట్టికొని ♦ వచ్చిన వారును సామియానఁ దా
మాఁదలఁదాల్చి కాదు మఱి ♦ యా ననకుండఁగ నెల్లవేళలన్
జీదర మాటలేక పనిఁ ♦ జేయుచునుందురు లంకలోపలన్. ౧౭౪

పురుషులతో సమానముగ ♦ బోటులు సర్వకళాభిరాములై
గురువులవద్ద విద్దెలను ♦ గోరిక నేర్చుటెకాక ఘోర సం
గరమున నస్త్రశస్త్రములఁ ♦ గైకొని యేయుట నేర్చి యందఱున్
గఱగఱికన్ స్వరాష్ట్రమును ♦ గాచెడి పూనిక నుందు రెప్పుడున్.

ఇంకని పౌరసేవ యొక ♦ టే పరమార్థము నిచ్చునంచుఁ గూ
లంకషపాండితీగరిమ ♦ లాభముచేత గ్రహించి మంచితో
లంకిణి పెండ్లిమాని యమ ♦ లం బతులంబగు బ్రహ్మచర్యమున్
గొంకక స్వీకరించె బుధ ♦ కోటి "హసాద" నఁద్యాగశీలయై.

పొలిసిపోని లంకారాజ్య ♦ మునకు నెల్లఁ
జేవఁగల లంకిణీదేవి ♦ చేతి కత్తి
వ్రేటు పెట్టని కట్టని ♦ కోటయయ్యెఁ
గనుగవను మూసి పౌరులు ♦ కునుకుచుండ. ౧౬౭

లంకిణిఁ గంచెలన్ దొడి, వి ♦ లాసముగాఁ గయిసేసి కాంచికా
కింకిణిజాలమున్ మొఱయఁ ♦ గింకిరిమార్తుర ప్రాణగొడ్డమా
వంకిణి చేతఁబట్టి పరు ♦ వంబున రేఁబవ లొక్కకై వడిన్
లంకిణి శాత్రవుల్ బెదర ♦ లంకను గావలిగాయు నెప్పుడున్.

రాజులు లంకవైపునకు ♦ రారు భయంబున లంకిణీ రిపూ
ద్వేజకమైన కత్తిఁగని ♦ బెళ్కుటి దానను శాంతిభద్రముల్
రాజిలు పౌరపాళి కవు ♦ రా! యిది కన్గొని లంకిణింగనన్
లాజలు చల్లుచుండెదరు ♦ లంకనుగల్గు పురంధ్రులందఱున్. ౧౬౯

ఆశ్రమంబులలో గృహ ♦ స్థాశ్రమంబె
యఖిలజనశిరోధార్యమా ♦ నంచుఁ దలఁచి
సోకు టిల్లాంధ్ర తలపూస ♦ చుప్పనాక
చేకొనె గృహస్థధర్మంబు ♦ చింతలేక. ౧౭౦

కేలుపట్టిన పెనిమిటి ♦ గూల, గోల
దండకావన సీమలోఁ ♦ దపము సేయు
నేకసుతుఁ డూఁతకోలగా ♦ నెగ్గతంబ
శూర్పణఖ ప్రొద్దులనుబుచ్చు ♦ సుగతిఁగోరి. ౧౮౧

బోటులకెల్ల ధర్మము ప్ర ♦ బోధముఁజేయుచు జీవహింస బా
హాటముగాఁగ నాపు పని ♦ కై విసుమాలక యెల్లప్రొద్దులా
మాటలె చెప్పుచుండి మను ♦ మార్గమునందున సంచరింపుచున్
దాటకరాజయోగపరి ♦ తర్పితయై పురివీడి పిమ్మటన్. ౧౮౨

వానప్రస్థము నూనుచు
మానుగఁ దాటకి మహాభి ♦ మానవతి యనూ
చానమటంచును దండక
కాననమున సుతులఁగూడి ♦ కాపురముండెన్. ౧౮౩

ఈగతి స్త్రీపురుషప్రభేదంబువలన స్వత్వంబులయందు వ్యత్యాసంబుఁ బొరయకుండ ధర్మసంరక్షణంబుఁ జేయుచు. ౧౮౪

పంతముతోడ నన్య నర ♦ పాలురపైఁబడి దోర్విభూతి దే
శాంతర సీమలంగెలిచి ♦ యావలిపుట్టఁగ వాఁనెల్ల సా
మంతులుగా నొనర్చికొని ♦ మంతునకెక్కి యథేచ్ఛతోడ వి
శ్రాంతిసిబూని రావణుఁడు ♦ రాజ్యముఁజేసెడి కాలమందునన్.

గండోపలచ్ఛటా ♦ గండూషితప్రస్థ
వింధ్యపర్వతపంక్తి ♦ వెనుకనెట్టి
పంచాస్యశార్దూల ♦ వన్యేభసంకీర్ణ
ప్రస్ఫురద్దండకా ♦ వనముదాఁటి
ప్రావృట్సమారంభ ♦ బహుపయస్సంపూర్ణ
దుర్లంఘ నిర్ఝరుల్ ♦ దూఁకివచ్చి

విషనరీసృపచమూ ♦ విష్కంభ దుర్లోక
తృణలతాగుల్మముల్ ♦ తీసివచ్చి
యార్యసంఘంబు మునిపల్లె ♦ లచ్చటచటఁ
గట్టుకొని వేగుపనికైన ♦ కాపురంబు
లుండి బహుజంతుహింసా ప్ర ♦ యుక్త యజ్ఞ
యాగములు చేయఁజొచ్చిరి ♦ యాగకుండ. ౧౮౬

మానినులెల్లరున్ భయము ♦ మాని విచారముమాని వెంటరా
మానిజనంబు దండము క ♦ మండలముంగొని పోయి పోయి, వే
కాననసీమలన్ నెమకి ♦ కాపురముండిరి పల్లెలన్ జన
స్థానమునందు గట్టుకొని ♦ దారులు కాయుచు మాఱుమూలలన్.

వృత్తవేది రావణుఁ డీ ప్ర ♦ వృత్తిఁ దెలిసి
శైవమత విరుద్ధంబైన ♦ జంతుహింసఁ
బెద్దప్రొద్దు చింతించి మా ♦ న్పింపఁదలఁచి
వీరసువు తాటకిని బిలి ♦ పించి పల్కె. ౧౮౯

తాటకిసాధ్వి రో! వినుము ♦ తప్పక యేమని చెప్పనేర్తు? నా
నోటను మాటరాదు విన ♦ నోచితి నీవిపరీతకర్మముల్
మాటలఁ దీరునే యొడలు మంటల బ్రుంగుచు నుండఁగాన నో
పాటలగంధి! యెట్లయినఁ ♦ బాపవె! నాపరితాపవహ్నినిన్.

ఆర్యులఁట నీతిపరులఁట ♦ యాహితాగ్ను
లఁట యెచటనుండియో వచ్చి ♦ రఁట పరోప
కారులఁట ద్రావిడులనఁట ♦ కాదనకఁట
దొడ్డమంత్రంబులఁ గడతే ♦ ర్తురఁట తల్లి. ౧౯౦

నియతిన్ గోమేధంబఁట
హయమేధ మఁట నరమేధ ♦ మఁట చేతురఁటే

దయమాలి స్వార్థపరులై
వ్యయ ప్రయాసములులేక ♦ యార్యమునీంద్రుల్. ౧౯౧

ఎఱుఁగుదు నీకుమారకుల ♦ నిర్వైర దుర్జయ బాహుసారులన్
దెరలని స్వామిభక్తులగు ♦ దిట్టగరాసుల వారితోడుతో
నరిగిన నీకుఁ దప్పక జ ♦ యంబగు నమ్ముము మాటలేల? యీ
తరుణమునందుఁ గర్జమును ♦ ధైర్యముతో నొనరింపఁగాఁదగున్.

కాదనఁబోకుమమ్మ, పని ♦ గల్గెనటం చెదురాడకమ్మ, త
ల్లీ! దరి తెన్నుఁగానక చ ♦ లించెడి డెందము మానుమాని యీ
మాదిరి నూరకున్న విష ♦ మంబగు దుర్గతి సంభవించు లె
మ్మా! దరిఁజేర్పుమమ్మ, మను ♦ మార్గముఁ బట్టిన నీకుఁదప్పునే?

పరుసని మాటలాడకుము ♦ వారలతోఁ దగురీతి నేర్పుమై
గరుసును దెల్పి యొప్పిదము ♦ గా మనయేల్బడినున్న సీమలన్
బరగెడి దేశధర్మమును ♦ వాకొని వారికి నచ్చునట్టులే
సరణిని జంతుహింస నిట ♦ సల్పఁగరాదని యొత్తిచెప్పుమా.

ఆముకవిని విశ్వామిత్రుఁ ♦ డనెడి మాని
వరుఁడు గోమేధమును జేయ ♦ వలయునంచు
యుదియుఁగొని యుండె నఁట వాని ♦ యుదియ యుడిపి
వెలఁది! యీపులుగాను త ♦ తప్పింపవలయు. ౧౯౫

మన ముపేక్ష సేయునెడ నీ ♦ యనువునందు
ధర్మనాశన మానమ్మ ♦ తప్పకుండఁ
బాడువారి దేశము ప్రజా ♦ పీడగల్గుఁ
జావు కదులెన్న ధర్మ ర ♦ క్షణముకొఱకు. ౧౯౬

మనతాతలు ముత్తాతలు
తనువులు బుడగలనుచు మదిఁ ♦ దలఁచియు కాదే

యనిసేయుచుఁ దెగటారిరి
జనములు మెచ్చఁగఁ స్వధర్మ ♦ సంరక్షణకై. ౧౯౭

రాజాజ్ఞ లేనిదే ♦ రాజ్యంబుఁ జొరరాదు
పరరాష్ట్రవాసులో ♦ ప్రజలు తెగువఁ
జొచ్చిరేనియుఁ జొచ్చి ♦ చొచ్చుటతోఁ దమ
రాకఁ దెలుపకుండ ♦ రాదు సతికి
ఉండిరేనియు నేత ♦ దుర్వ్యసుశాసన
ములనెల్ల జవదాఁటి ♦ పోవరాదు
పోయిరేనియు వారు ♦ భూపాలు శిక్షలఁ
దిన్నఁగాఁ దలఁదాల్చి ♦ తీరవలయు
చోరులంబోలె దేశంబుఁ ♦ జొచ్చి వారు
పూని ధర్మవిరుద్ధంబు ♦ లైన పనులు
చేసి రాజాజ్ఞ ప్రతిఘటిం ♦ చెదరు, దండ్యు
లైరి యాకారణముచేత ♦ ననుచుఁ దెల్పి. ౧౯౮

మంచిమాటల జన్నంబు ♦ మానిపింపు
లేద దండకాటవినుండి ♦ లేవఁగొట్టి
పొమ్మను మఁటన్న నామంత్ర ♦ ణమ్మువడసి
చనియెఁ దాటకి రాజాజ్ఞఁ ♦ జక్కఁబెట్ట. ౧౯౯

పూఁచిన కార్యభారమున ♦ మున్నడి తాటకియింటికేగి మా
రీచసుబాహులం బిలిచి ♦ తేని యనుజ్ఞనుదెల్ప వారలున్
లాఁచి నితాంతశక్తిని జ ♦ లంబునఁ దల్లినిగూడి దివ్యవ
ర్మాచితదేహులై వెడలి ♦ యందఱు చేరిరి యజ్ఞవాటికన్. ౨౦౦

చేరి గాధేయునకు జేఁడు ♦ చెప్పినంత
పూసగుచ్చినకైవడి ♦ బోధపడప
నెంతలేసిమాటలని గ్రు ♦ డ్లెఱ్ఱఁజేసి
నిప్పుత్రొక్కినకోఁతియై ♦ నెగిరిపడుచు. ౨౦౧

కాపేయంబునఁ గ్రిందుమీఁదెఱుఁగకా ♦ కంపించు దేహంబుతోఁ
గోపాటోప విఘూర్ణమానుఁడయి సం ♦ కోచంబు నేమాత్రముం
జూపంబోవక కౌశికుండపుడు గ్ర ♦ చ్చుల్గొట్టి వాచాలుఁడై
మాపట్టుల్ విడఁబోవమంచుఁ బలుకన్ ♦ మర్యాద లేకుండఁగన్.

పల్కు లాలించి సంక్షోభ ♦ పడక, యుదరి
పడక, మోమోటపడక ని ♦ బ్బరము చెడక
తాటకీసాధ్వి రాజాజ్ఞ ♦ తప్పదనుచుఁ
బాఱఁజూచి పుత్రులవంక ♦ బఱటెనంత. ౨౦౩

పట్టుమంచు మారీచ సు ♦ బాహులపుడు
పట్టు విడనాఁడవో మృషా ♦ బ్రాహ్మణుండ!
కాంతు మీవేమిసేయఁగాఁ ♦ గలవొ యంచు
యజ్ఞ విఘ్నంబు సల్ప నా ♦ యత్తపడుచు. ౨౦౪

యూపంబులకుఁ గట్టి ♦ యున్న యాఁబెయ్యల
మెడత్రాళ్ళ సడలించి ♦ విడచిపుచ్చి
చిద్రుపలుగాఁగొట్టి ♦ చేర్చియుంచిన రావి
చిదుగు కుప్పలపేళ్లు ♦ చిమ్మివైచి
గుమగుమ తావి యా ♦ గుబ్బగాఁ గొట్టు నా
వుల నేతి పంచెలు ♦ బోర్లగించి
కుండంబులోనుండి ♦ కొలఁది నాల్కలుగోరియు
నగ్నిహోత్రమ్ముఁ జ ♦ ల్లార్చివైచి

దర్భలను నాల్గుమూలలం ♦ దరలవైచి
పాఱుఁబోతులం బెదరించి ♦ పాఱఁద్రోల
మిన్ను విఱిగి కూలినమాడ్కి ♦ మిణకరించి
చూచిచూచి యప్పుడు గాధి ♦ సూనుఁడంత. ౨౦౫

ప్రాఁతలాతాము మెల్లగాఁ ♦ జేతఁబట్టి
చంక నిఱికించి చినిఁగిన ♦ జింకతోలు
లెండు లెండంచు శిష్యుల ♦ లేవఁదీసి
తల్లడిల్లి సాకేతంబు ♦ దారిపట్టి. ౨౦౭

కూఁకలు పెట్టుచుం బెదరఁ ♦ గొట్టుచు నట్టడవిన్ వసించి కా
రాకులు కూడుగా, మెసవు ♦ నట్టి మునీంద్ర జనంబుమీఁదికిన్
దూఁకులుదూఁకి కావరము ♦ తోఁ దెగనాడిరటంచు రాజుతో
సాకులు చెప్పుచుం దగిన ♦ శాస్తియొనర్చెదనంచుఁజెప్పుచున్.

గోవులఁ జంపినంత తమ ♦ కొంపమునుంగునె? వీరి కక్కటా!
గోవులు గోవులంచుఁ బయి ♦ కొందురు తద్వ్యధనాపద్రావిడుల్
గోవుల మాంసపుంజవులు ♦ కొద్దిగనైన నెఱింగియున్నచో
గోవులఁ జంపఁగూడదని ♦ గొల్లునఁ జెప్పుట వీరు మానరే. ౨౦౮

ఎంతయత్నంబుఁ జేసిన ♦ నేమివచ్చె?
నావునెఱచిని రుచిచూడ ♦ రైరి వారు
సోమపానంబునుం జవి ♦ చూడరైరి
ఇందుచే నిన్నియిక్కట్టు ♦ లేగుదెంచె. ౨౦౯

అమ్మరివోసి చుల్కనగ ♦ నాఁడుది సైతము లక్ష్యశుద్ధితోఁ
గిమ్మనకుండ శాత్రవులఁ ♦ గీటడగించుటె కాక ఘోరసై
న్యమ్మును నిక్కతోనని మొ ♦ నన్ నడిపింపగనేర్చు నిట్టి రా
జ్యమ్మును దొల్లి యేనెఱుఁగ ♦ నైతిని నైతి యెటో జయింపఁగన్.

పోటుకానితోడఁ ♦ బోటుకత్తియ కూడ
నిలిచి పోరుచుండ ♦ నిలువఁగలరె
వైరులెంత గండు ♦ వజ్జీరులైనను?
మాట దక్కఁబోదు ♦ మాటలేల? ౨౧౧

బొమ్మముడివేసి తలముడి ♦ వుచ్చకుండ
అవికముడి వేయునట్టు లా ♦ ఘవముగొరల
నరుల ముడివేసి ముడిచేవ ♦ నరులగొంతు
ముడి నురలఁబుత్తు రిచ్చటి ♦ ముద్దరాండ్రె. ౨౧౨

అంచుఁ జింతించుచుఁ జింతాకులమానసుండై, శిష్యులం గూడి యిటునటు చూడక, యడుగులు లెక్కించుకొనుచుఁ గాలి నడకతో, గాలిపాటునకు జంకక, గాలిపాటలు పాడుకొనుచు నెమ్మదిగా ౨౧౩

ఏరులుదాఁటి వాటముగ ♦ నెన్నియొ క్రొందలిరాకు బాటలన్
నేరుగ దండకావన వి ♦ నిర్గమనంబొనరించి పిమ్మటన్
వారక భంగపాటు పొర ♦ పాటును దల్లశపాటు పెట్టఁగా
నూరక గాధినందనుఁ డ ♦ యోధ్యకుఁబోయెనుదొట్రుపాటుతో.

కులపతియౌ వసిష్ఠముని ♦ కొంపను జొచ్చి రహస్యపద్ధతిన్
గల తెఱఁగెల్లఁజెప్పి యిది ♦ కాదదికాదని దీర్ఘదృష్టితోఁ
బలుమరు చర్చఁజేసి యిది ♦ భావ్యమటంచును నిశ్చయించి తా
వెలలెను గౌశికుండు పృథి ♦ వీపతి దర్శనసంభ్రమంబునన్. ౨౧౫

దశరథభూమిపాలకుని ♦ దర్శనముం బొనరించి ప్రేమతోఁ
గుశలమునడ్గి యేమిపని ♦ కోరనివానినిబోలె సర్వమున్
విశదముగా నెఱింగి తన ♦ విప్లవభావము తోఁపకుండ నా
కుశికతనూభవుండు కొన ♦ గోళ్ళను గడ్డము చిక్కుదీయుచున్.

పొరపడకుండఁ దొట్రుపడఁ ♦ బోక గరాగరి మంచిమాటలన్
నరవరు మోముపాటుఁగని ♦ నమ్మకముం జెడకుండఁ జక్కఁగా.
సరిపడునట్లుగా నొరులు ♦ సైతము మేలని మెచ్చురీతిఁగా
వరుసగఁ జెప్పె నిట్లునర ♦ పాలుని మ్రోలను జాల జాలితో. ౨౧౬

పాపభూయిష ప్ర ♦ వర్తనంబును బాసి
సంసారసంబంధ ♦ సరణి రోసి
బహుళజనాకీర్ణ ♦ పట్టణంబుల వీడి
కారుపల్లెలలో మె ♦ కాలఁగూడి
ప్రత్నశిష్టాచార ♦ పథమట్టె చేపట్టి
మొలచుట్టు పాఱుటా ♦ కులనుజుట్టి
ఐశ్వర్యములనెల్ల ♦ నఱకాల దిగఁదన్ని
భాగ్యభోగ్యములన్ని ♦ పాఱఁదన్ని

షడ్రసోపేతమైన భో ♦ జనముడించి
కాయగసరులతో నెట్లొ ♦ కడుపునించి.
పారమార్థిక చింతతోఁ ♦ బరముఁ గొల్చి
బ్రదుకుచుంటిమి తాపసా ♦ శ్రమముఁదాల్చి. ౨౧౮

సూరవంశాభి వృద్ధిని ♦ గోరి కాదె
యారితేఱిన మేధావు ♦ లైన మునులు
దండకావనిఁ జేరి యం ♦ దుండి తపముఁ
జల్పుచెల్లను నగచాట్ల ♦ సరకుగొనక. ౨౧౯

ఆర్యులనుపేరు విన్నంత ♦ నచటిరాజు
లాగ్రహోదగ్రులై వారి ♦ హతమొనర్ప
సిద్ధమాదురు మావంటి ♦ శీర్ణదేహు
లేమి సేయంగ నేర్తురో ♦ నృపతిచంద్ర! ౨౨౦

సెలయేళ్ళ నీళ్ళ దో ♦ సిళ్ళతోఁ గడుపాఱఁ
ద్రావి ముప్పూటలఁ ♦ దనియుచుండి
పండి రాలిపడిన ♦ యెండుటాకులు పండ్లు
నొంటిపూట భుజించి ♦ యొదిగియుండి

పూలతావులలోనఁ ♦ బొరలివచ్చెడి గాలిఁ
గోర్కెమైఁ దనివోవఁ ♦ గ్రోలుచుండి
మనసుపోయిననాఁడు ♦ మాత్ర నివ్వరిభోజ
నముఁజేసి యెట్టులో ♦ నవయుచుండి

యుఱకయీరాలపొంత గూ ♦ ర్చుండు మమ్ము
నడవి మెకములం జూచెదు ♦ నట్టు చూచి
యెక్కసక్కెములంజేతు ♦ రేవగించి
జాతివైరంబు మనసులో ♦ సందడింప. ౨౨౧

ఎంతదూరంబు తఱిమి ము ♦ నీశ్వరుండు
చెప్పుచుండిన దశరథ ♦ క్షితివరుండు
మాటలాడకుండిన యంత ♦ మసలిపడుచు
నుల్లకుట్టు మాటలచేత ♦ నులికిపడఁగ- ౨౨౨

దూరముఁ బొఱఁజూచు చెవి ♦ దూరవు నేనిపుడాడుపల్కులు—
గారణమేమియో తెలుపఁ ♦ గాఁదగునయ్య యసహ్యమయ్యెనే?
పాఱులు నిల్వనేఱని నృ ♦ పాలురరాజ్యము వృద్ధిఁబొందునే?
కాఁదియలందఁడే నృపతి ♦ కష్టపరంపర రాక తప్పునే? ౨౨౩

పులినోటి కండవలె మా
నులు ముప్పొద్దుల మహో మ ♦ నోవ్యథచేతన్
గళవళపడి నిలువంగాఁ
దెలియని వానివలె నుండఁ ♦ దెలిసిన పనియే? ౨౨౪

తెలిసికొనవా నీరాజ్య వి ♦ స్తృతికిఁగాదె
ఋషులు దండకావనసీమ ♦ కేగి యందె
నిలిచిపోయినా రిది నీవు ♦ తలఁపవెట్లు?
ఇంతటి కృతఘ్నతను నే స ♦ హింపఁజాల. ౨౨౫

చొచ్చిరి దండకావనము ♦ శుష్కశరీర విషణ్ణచిత్తులై
నొచ్చిరి ద్రావిడప్రభుల ♦ నూరినవెగ్గెడి చిక్కటారులన్
వచ్చిరి నేఁడు దిక్కని భ ♦ వచ్చరణంబును గోరి వారలన్
గ్రచ్చఱ నాదరించి, యుప ♦ కారముసేయ వదేమి చెప్పుమా.

కుశికసుతుం డిటులాడఁగ
దశరథుఁడుం గటకటపడి ♦ దైన్యముతోడన్
దిశలూరక కన్గొనుచు వి
వశుఁడగుచు వచించెనిట్లు ♦ భయభక్తులచే. క. ౨౭

కులపతులౌ మునీశ్వరుల ♦ కున్ వలవంతలు గల్గుచుండ వ్యా
కులపడకుండ నుండుదుమె? ♦ కొండలమందదె మాదు డెందమ్మున్?
విలయము వచ్చిపడ్డ రఘు ♦ వీరులు పాఱులఁ బ్రోవకుండ శ
త్రుల మొగసాలముందుఁ బడ ♦ ద్రోతురె? యెందులకిట్టినిందలున్?

ఇదె! పోదము రాఁగదె దో
ర్మదమున ద్రావిడులు పోవు♦మార్గము లెల్లన్
వదలక యరికట్టెద నా
ప్రదరములకు నెవ్వరడ్డు ♦ పడఁగలవారో! ౨౯

తడయఁగ వద్దు పోవుదము ♦ దండక కాననసీమ కిప్పుడే
గుడుసువడంగ సింగిణి ల ♦ కోరులు "రంయిని" దూఁకుచుండఁగాఁ
గెడపెద నేను మార్తురను ♦ గీటడగించెద ద్రావిడప్రజన్
గడగడలాడఁజేతు గమి ♦ కాండ్రను గాండ్రని బొబ్బవెట్టుచున్.

అబమా సుబమే మెఱుఁగని నా ♦ యట్టివాని
మీఁద నిందమోవుట ధర్మ ♦ మే? మహాత్మ!
విప్ర సంతర్పణంబైన ♦ పిదపఁ గాదె?
యేము భక్తితో భుజియించు ♦ టింతో యంతో. ౩౧

ఏయుగమందు మా రఘుకు ♦ లేశులు భూపతులన్నమాట కా
నీ! యెపుడైన నొక్కపని ♦ యేని స్వతంత్రతఁ జేసినారలే?
యీ యనుమానమేల? పదుఁ ♦ డీ! యిపుడే పయనంబమైతి స్వా
మీ! యిటువంటి పల్కులు స ♦ హింపఁగనేరను వేయునేటికిన్.

అనిచెప్పుచు నుండంగాఁ
జనుదెంచి వసిష్ఠమౌని ♦ సాంతముగాఁ దా
విని సర్వోదంతంబిటు
జనపాలుని తోడఁబల్కె ♦ ధర్మముతోడన్. ౨౩౩

కడువృద్ధుండవు నీవి
క్కడను నిలిచి యుండి యేలఁ ♦ గల్గుముగానీ
యడవుల వెంబడిపడి త్రిము
క్కడి మానవులఁ బడఁగూల్పఁ ♦ గల్గుదువోకో. ౨౩౪

చెలువముకగ్గ నీవయసు ♦ చెల్లఁ బటుత్వము కొంతతగ్గ నీ
కిలపయిఁ దీరఁగాఁదగు న ♦ భీష్టము లెల్లను దీరిపోవ నీ
యలవుచలంబు నెందులకు ♦ నక్కఱరా వదిగాక నీతనూ
జులకు విరోధిమారణముఁ ♦ జూఱగొనంగను నేర్పఁగాఁదగున్,

కావున రామలక్ష్మణుల ♦ గాదిలి బిడ్డల నిర్వురన్ మహా
పావనుఁడైన మౌనికుల ♦ వర్యునిచేతను బెట్టి పంపుమా
పూవులలోన పెట్టికొని ♦ పోయి విరోధిచమూసమూహముం
జావఁగఁ గొట్టి తెచ్చి మన ♦ సన్నిధి నుంపఁగలండు భూవరా!

భానువంశంబునకు వన్నె ♦ వాసికల్గఁ
జెలఁగి నీకీర్తి దెసలెల్లఁ ♦ జిందుఁ ద్రొక్క
వెనుక ముందు యోజనలెల్ల ♦ విడచిపెట్టు
మంచుఁ జెప్పగా దశరథుఁ ♦ డావులించి



కంటినీటితో బిడ్డల ♦ జంటచేసి
చివుకుమన గుండె మౌనీంద్రు ♦ చేతఁబెట్టి
శోక మెటుమాన్తురో నాకు? ♦ లేక లేక
కన్న సంతాన మియ్యది ♦ కావుమన్న! ౨౩౮

ఛెఱియొకవైపునఁ నిలిచి ♦ చిందులుద్రొక్కుఁగ రామలక్ష్మణుల్
ముఱియుచుఁ గౌశికుండు తన ♦ ముప్పు దొలంగెను నేఁటితోడ నం
చురవడిఁ బైనమయ్యెఁ జటు ♦ లోగ్రభయంకరదండకాటవిఁ
జొరి పరిమార్ప ద్రావిడులఁ ♦ జుబ్బన చూఱఁగ నిబ్బరంబుగఁ.

పిన్నలు రామలక్ష్మణులు ♦ బెగ్గిల వచ్చును వింటిమ్రోఁతలఁ
విన్నను వేగిరింపఁ జెడు ♦ వేయగుఁ గావున మెల్లమెల్లఁగా
వెన్నునఁ దట్టి భీతి యొక ♦ వేళ ఘటిల్లినఁ బోవఁబుచ్చి రా
మన్నకు మున్నుగాఁ దెగువ ♦ యబ్బెడుకై వడిఁజేయుటొప్పగుఁ.

అనుచుఁ దలపోసి పోసి య ♦ నంతరమ్ము
తికమకలు మాని మాని యు ♦ ద్రేకమడఁచి
యొక యుపాయంబు నూహించి ♦ యొరుల కేమి
చెప్పకుండఁగాఁ గార్యంబుఁ ♦ జేయనెంచి. ౨౪౧

ముఱిముఱి చీఁకటుల్ దెసలు ♦ మూసెడివేళ నరణ్యసీమ నొం
టరిగ వసించు తాటకిఁ ద ♦ టాలునఁ బైఁబడిగూల్చుటొప్పుఁదొం
దరపడకుండ నాఁడుదిగ ♦ దా! యెటుపో యెటువచ్చినన్ సరే
దెరలఁగవచ్చు రామునకుఁ ♦ దీరఁగవచ్చు భయంబు కల్గినఁ.

ఈగతి ననేకవిధంబుల నూహించుచుఁ బ్రొద్దు పడమటిదిక్కునకు వ్రాలుటఁ దలంచి యుత్తలంబున

ఎత్తిలి కాలిబాటఁబడి ♦ యేగుచు సంయమి దారిలోఁ బురా
వృత్తము లెన్నియేని విని ♦ పించుచు శౌర్యము పొంగి పోవఁగాఁ
జిత్తములోన నూహాలొగిఁ ♦ జిక్కురు బొక్కురుగాఁగఁ బుట్టఁపే
రెత్తినఁ గాలుద్రవ్వనటు ♦ లెంతయుఁ జేసెఁ గుమారు లిర్వురఁ.

ఈప్రకారంబునఁ గొంతదవ్వేగి సంభ్రమించుచు విశ్వామిత్రుండు రామునిం జూచి ప్రసన్నవదనంబుతో నిట్లు మూదలించి పల్కెను. ౨౪౫

అల్లదె! చూచితే! యట జ ♦ మక్కడ నొక్కటి దానిలోపలన్
గల్లలమారియైన యొక ♦ కామిని తాటకి పేరుతోడ రే
లెల్ల వసించు నీమె హాసి ♦ యించెడి నార్యులు గోఘ్ను లంచు నీ
యల్లరి రూపుమాపవలె ♦ నాయమనుం దొలిముద్దఁ జేయుమన్.

ఆఁడుదియని తండ్రీ! యెదు
రాడకు నీ వింటికి నెఱ ♦ యగునటుగాఁ దూఁ
టాడుము దయమాలుము నీ
యూఁడేది జగజెంత యెంత ♦ కైననుజాలున్. ౨౪౬

అనిన వెంటనే నరపాల ♦ తనయు లట్టె
విల్లు సవరించి సరిచేసి ♦ పిఱుతివియక
దూసి కఱపుటమ్ములఁ గవ ♦ దొనలనుండి
నారి మ్రోయింప దెసలెల్ల ♦ బూరటిల్ల. ౨౪౭

తాటకి వింటిమ్రోఁతవిని ♦ దబ్బున బైటకువచ్చి నిల్వఁగా
వాటెడు తూపులన్ సుదతి ♦ పైఁ గురియించిరి చిత్తజల్లుగా
గాటులుబెట్టుచున్ దుదకు ♦ గాళ్లను జేతులు త్రుంచిత్రుంచి య
చ్చోటనె కూల్చివైచి రతి ♦ శూరులు గారె కుమారులిర్వురున్.

ఇంతమొగముఁ జేసికొని వ ♦ నీశ్వరుండు
కేకిసలు గొట్టుచుండ సిం ♦ గిణుల యెక్కు
డించి మూఁపుదోయికి దగి ♦ లించి రామ
లక్ష్మణులు నిల్చియున్నంత ♦ గ్లానిలేక. ౨౫౦

ముక్కువాతను నెత్తురుల్ ♦ గ్రక్కి క్రక్కి
చాపకట్టుగాఁ బుడమిపైఁ ♦ జచ్చిపడిన
పడతిఁ బెడనవ్వుతోఁ దేరి ♦ పాఱఁజూచి
మాని సాఁగెఁబో రామల ♦ క్ష్మణులఁగూడి. ౨౪౧

ఇట్లు వేయిమాసంబుల ప్రాయంబు చెల్లి మూఁడుకాళ్ల ముదుసలియగు తాటకిని యౌవనప్రాదుర్భావమునఁ గలిగిన కండక్రొవ్వున మిట్టిపడుచున్న యిర్వురు రాకుమారులచేఁ జంపించి యొడలు తెలియక సల్లాపంబు లాడికొనుచుఁగలఁక దేఱని మనంబుతో రామలక్ష్మణుల వింటినేర్పు ముక్కాకలందీరిన ద్రావిడహంవీరవరుల నేర్పునకు నుద్దికాదని సంశయగ్రస్తుండై విశ్వామిత్రుండు పాలుపోక ముందునకు సాఁగిపోవుచు మచ్చరంబునఁ దనపూర్వాశ్రమంబున నేర్చికొన్న యఖిలాస్త్రశస్త్రంబులఁ దొడుగను, నేయను, ముడువను నేర్పి, తనయాశ్రమంబుఁ జొచ్చి తల్లడపడుచున్న మనంబుతో, సంబారంబులఁ గూర్చికొని, చవిచచ్చియున్న నాలుక త్రుప్పుదుల్లపుచ్చ వేగిరి పడుచు, గోమేధంబును జేయ యత్నించుచుండెను. ఇంతలో మాతృమరణంబు నెఱుంగని, మారీచసుబాహులు, తల్లియానతిఁ దలమోయుచున్నవారు గావున యజ్ఞవిఘ్నంబు నాచరింప సనుకట్ట శ్రీరామభద్రుఁడు నాఁడు నెత్తుటితడి యాఱనిచేతితో వాఁడియమ్ములు దొడిగి చీకటి యోలంబున నిలిచి, నడిచప్పుడు కాకుండఁ జెవిఁ దాఁకువఱకు లాగి, విడువ నందొక్కటి సుబాహు ప్రాణంబుల హరియించె, రెండవది లక్ష్యశుద్ధి కొఱవడుటచే గుఱితప్పి, మారీచు ప్రాణంబుల హరియింపనోపక డిల్లపడునట్టు భూమిపై ద్రొల్లఁజేసె. అంత నతండు భీతిఁగుడిచి పలాయితుండయ్యె. పిమ్మట విశ్వామిత్రుండు నిరాతంకంబుగా యజ్ఞపరిసమాప్తిఁ గావించి, రామలక్ష్మణుల చేతిలావు చాలమిఁ జక్కగా గ్రహించి మిన్నకుండవలసినవాఁ

డయ్యెను. రామలక్ష్మణులతోఁ గొంతకాలంబు తన యాశ్రమంబున విశ్రమించి వారిచే నగు కార్యము లేమింజేసి విశ్వామిత్రుండు తిన్నఁగా వారలం దోడ్కొని దుక్కిదున్న ననువుగాని వేవిలిమెట్టదారుల నెఱికి పొలములంబడి, మిథిలకుం గొంపోయి యందుఁ బదిపండ్రెండు తరములనుండి, పడియుండి, చివికి చెదదిన్న పెద్ద ప్రాఁతవింటిబద్ద విఱిపించి, రాజకీయ సఖ్యంబు నపేక్షించి, యార్యులయందలి రెండు తెగలవారికిఁ జుట్టఱికం బెట్టులయినఁ గూర్ప గట్టిచేసికొని, శ్రీరామునికంటెఁ బెద్దదియుఁ దెలియని పుట్టుపూర్వములు కలదియు నగు సీతామహాదేవిని, శ్రీరామునకుఁ బెండ్లిచేయించి, సాకేతంబునకుఁ దిరిగివచ్చుచు, దారిలో ముసలివగ్గు వటుగైన పరశురామునిఁ దన గురుధనుర్భంగముచేఁ గుపితుఁడైనవాని బదరి వానిని వింధ్యాటవులం దాఁటి దక్షిణాపథమున మాఱుమూలనున్న కేరళ దేశంబునకుఁ బోయి యందు నార్యనాగరికత వ్యాపింపఁ జేయ నొడంబఱచి పంపి యయోధ్యకరిగి యందు రామలక్ష్మణుల డించి కౌశికుం డెందే యేగెను. ౨౫౨

రాజ్యతృష్ణ తీరని దశ ♦ రథుఁడు రాజ్య
భారమును రామునకు నీక ♦ పాలనంబుఁ
జేయుచుండ శ్రీరాముండు ♦ సీతఁగూడి
కామతంత్రుఁడై ప్రొద్దులు ♦ గడపుచుండె. ౨౫౩

తోడఁతోనాఁడు నె ♦ త్తురుఁ ద్రావి కడుపాఱ
తెపతెపలాడు మా ♦ నుపులులైన
చిచ్చఱమ్ముల పిండు ♦ చెలరేఁగి కవదొనల్
త్రోపాడి నాలుకల్ ♦ గ్రోయుచుండ
ద్రావిడ మన్నీల ♦ ప్రాణంబుల హరింప
శ్రీరామ చంద్రుండు ♦ చింతఁజేసి

ఏమొక్కు చేసైన ♦ నిల్లువాకిలి డించి
దండకారణ్య భూ ♦ స్థలికి నేగి
యార్యరాజ్య విజృంభణ ♦ మాచరింప
మంచి తరికోసరం బట్టె ♦ పొంచియుండ
నింతలో రాజు వార్ధక్య ♦ మెనయఁదన్నుఁ
జెలఁగి పట్టాభిషిక్తునిఁ ♦ జేయనెంచ. ౨౫౪

కేకయ రాజపుత్రిఁగని ♦ క్లిష్టపరిస్థితిఁ బూసఁగ్రుచ్చిన
ట్లేకరువెట్టి యేకరణి ♦ నేనియుఁ దల్లిరో! దండకాటవీ
ప్రాకట వీథులందిరుగు ♦ భాగ్యము నాకొడఁగూర్చిపంపవే
వీఁకమెయిన్ విదల్తు రిపు ♦ వీరుల, రాజ్యము పెంపుచెందఁగన్.

రాజు సంతుష్టుఁడైనచో ♦ భ్రష్టుఁడగు న
టంచుఁ బెద్దలు నుడువు వా ♦ క్యమ్ములన్ని
యెఱుఁగుదువు కాదె? తల్లి! నా ♦ కేమగడవు
నీవుదక్క వేఱెవ్వరు ♦ నేఁడు కలరు? ౨౫౫

అని యీగతి శ్రీరాముఁడు
పినతల్లినిఁ జేరి పలుకఁ ♦ ప్రేమముతోడన్
విని కేకయ రాజాత్మజ
చనువున వచియించె నిట్టు ♦ చతురోక్తులతో. ౨౫౬

సరిలెమ్ము కన్నతండ్రీ!
తరుణము కనిపెట్టియుండి ♦ తప్పక నేనే
నెరవున నైనను నీపని
సరిఁజేసెద నమ్ముమెట్టి ♦ సడిపైఁ బడినన్ ౨౫౭

అని కైకేయి వచియింప శ్రీరామచంద్రుండు ప్రహృష్టాంతరంగుండై, పినతల్లివద్ద సెలవుంగైకొని వెడలిపోయె. అటుపిమ్మట వాఁడియు

నొక్కనాఁడు కైకేయి పుట్టినింటి దాసియైన మంధర వడివడి వచ్చి "దేవీ! కేకయరాజపుత్రీ! సార్వభౌముండు శ్రీరామచంద్రుని బట్టాభిషిక్తునిఁ జేయుటకు లగ్నంబు నిశ్చయించి సంభారంబులను సేకరించుచుండెను, ఱేపే పర్వదినంబని రోజుచు నుడువఁ గైకేయి తనకుఁ దలఁచనితలంపుగాఁ జేఁజిక్కిన సమయంబునకు మురిసి, తొల్లి మహాదారుణరణంబునఁ దాఁ జేసిన తోడ్పాటున కలరి, తన పతియిచ్చిన వరద్వయంబున, రాముని వనవాసంబునకు, భరతుని పట్టాభిషేకంబునకు వయోవృద్ధుండును, స్త్రీలోలుండును, నయిన చక్రవర్తిని నొప్పించి, యొప్పించి యీసమాచారంబు శ్రీరామునకుఁ దెలుప సహధర్మచారిణియగు సీతతోడను, సోదరుండయిన లక్ష్మణునితోడను, విపినావాసంబునకుఁ దండ్రి వలదని వలవల వాపోవుచుండఁ బయనంబై. ౨౫౯

రథము తోలంగఁ బ్రాజిత, ♦ రాజవీథిఁ
బోయి గంగనీళ్లాడు రే ♦ వునకునేగి
యచట దేరుడిగ్గి సుమంత్రు ♦ నంపివైచి
తోఁచని మదితో దోన్నకై ♦ వేచియుండ. ౨౬౦

రాజనీతిజ్ఞుఁడై నట్టి ♦ రాముఁడంత
దేశకాల పాత్రంబులఁ ♦ దెలిసికొనుచుఁ
జతురుపాయప్రయోగ కౌ ♦ శలముచేతఁ
దన యభీష్టంబు నెఱవేర్చ ♦ కొనఁదలంచి. ౨౬౧

పురుడు లేనట్టి లావరి ♦ బోయపెద్ద
నదురు లేకుండ గంగపై ♦ నడపఁగలఁడు
పడవ యెట్టిదైనను, నట్టి ♦ గడుసుదిట్ట
గుహుఁడు వాని నేస్తముఁజేసి ♦ మిహిరకులుఁడు. ౨౬౨

మంచిమాటలాడి ♦ మన్నించి పదిలంబు
గాఁగఁ బడవనెక్కి ♦ గంగదాఁటి
కాలినడకతోడఁ ♦ గదలిపోయిరి ముగ్గు
రంతుపొంతులేని ♦ యడవికేసి. ౨౬౩

భద్రముగాఁ బ్రయాసపడి ♦ వారలు మూవ్వురుపోయి చిత్రకూ
టాద్రిని జేరఁగా భరతుఁ ♦ డచ్చటికిం జనుదెంచి దీర్ఘమౌ
నిద్రనుబొందెఁ దండ్రియన ♦ నిక్కమువంమరి పాదుకాద్వయీ
ముద్రనొసంగి రాఘవుఁడు ♦ పొమ్మని చెప్పి తలంచె నీగతిన్.

ఇచ్చట నున్నచో భరతుఁ ♦ డీగతి వెండియు బాధపెట్టఁగా
వచ్చును జాలితోఁ దిరిగి ♦ పట్టణసీమకు రమ్మటంచు నా
వచ్చిన కార్యముం జెడఁగ ♦ భక్తుఁడు నాకతఁ డౌఁటొ గానమే
మిచ్చటనుండి దూరముగ ♦ నేగుట కర్జమటంచు నెంచుచున్.

వానవంగుళ్ళ కోరిచి ♦ వలికి నోర్చి
యుఱుము మెఱుముల కోరిచి ♦ యుబ్బకోర్చి
యెండ దగ దప్పులకునోర్చి ♦ యెడకు నోర్చి
పయన మైరంత దక్షిణా ♦ పథముఁబట్టి. ౨౬౬

ఇటు పడిపోవఁబోవఁగ ము ♦ నీశ్వరపుత్రుఁ డొకంచుదాఁకిలోఁ
దటుకునఁ గానిపించిన ము ♦ దంబున క్షేమ మెఱింగినంత నీ
యటవిని మౌనిశేఖరుల ♦ యాశ్రమభూములు కొన్నియున్నవే?
యిటకు సమీపమందు నొక ♦ టేనియుఁ గల్గునె? చెప్పుమీయనన్

మాణవకుఁ డంతఁ జెప్పె నీ ♦ మార్గమందు
నవతి దూరంబునందు నే ♦ యాశ్రమమొకఁ
డున్నయది దేవ! మిక్కిలి ♦ యొప్పుగల్గి
యనిన మూవురా దారినే ♦ చనుచునుండ. ౨౬౮

చిఱుతతనంబుగోలెఁ బర ♦ సేవయె వృత్తిగ నెంచుచుంటిఁ సదా
గరువతనంబు మాని కల ♦ కాలము మానుల యాకుపాకలన్
దొఱకెడి భుక్తశేషమును ♦ దూఁటుచు సాపడి వారిపొత్తుచేఁ
బొరయుదు స్వర్గమంచుఁ దల ♦ పోసెడి కామినియుండె నచ్చటన్.

ఇట్లు చెప్పుచుండ నేనును సంకులితస్వాంతుఁడనై, యట్టి నిరభిమానంబున సంచరించిన యామె చరిత్ర యెట్టిదో, యామె యానుపానులెట్టివో యెఱుంగ నభిలషించి, సూతమహర్షిమోముఁ దిలకించి.

ఆమెపేరేమి? యేజాతి ♦ యందుఁబుట్టె
జగతియందున నేఁడామె ♦ జాతికలదె?
యున్నచో నిప్పుడెచ్చట ♦ నుండెనయ్య
సంగ్రహంబుగఁ జెప్పుఁడో ♦ సంయమీంద్ర! ౨౮౦

అనిన మౌని యర్ధనిమీలి ♦ తాక్షుఁడగుచుఁ
జెప్పఁదొడఁగెను నీరీతి ♦ నీద్రవడక
పెద్దవార లామెకుఁ బేరు ♦ పెట్టలేదు
శబరి యనిమాత్ర పిల్చిరి ♦ జాతిపేర. ౨౮౧

మునులకు బట్టల నుదుకుచుఁ
గనిపెట్టుక యుండి యొక్క ♦ కడికూటికినై
పను లెబ్బెటికము లేకయె
పొనరించెడి వంగడంబు ♦ పోడిమి చెడఁగాన్. ౨౮౩

జాతిభ్రష్టయటంచును
జాతి శబరు లట్టి బాని ♦ నను వెలివేయన్
వాతెఱఁ గొఱుకుచు నామెయు
జాతామర్షంబునఁ దన ♦ జాతినిబాసెన్. ౨౮౪

పాసినయంతమీఁద ముని ♦ పల్లెలయందు సదా వసింపుచున్
బాసినకూడు నొక్క కడి ♦ వంతున వారలు పంచిపెట్టఁగా
దోసిటఁబట్టి సాపడుచుఁ ♦ ద్రొక్కి సలాడక బ్రహ్మవిద్యనున్
బాసినవంటకంబొసఁగె ♦ బాపురె! యంచుఁదలంచునామెయున్.

వరవుడం బెంతచేసినఁ ♦ బాపమేమి
వచ్చె? నీయరయిరి గౌర ♦ వంబుసుంత
జాలితో నామెపల్కుల ♦ నాలకించి
కనుబొమ లెగురవైతు రా ♦ మునిజనంబు. ౨౭౬

పేరుపెట్టియెన శబరిఁ ♦ బిల్వలేదు
పరువు చెడిపోవునని గ ♦ ర్వంబుచేత
నిట్టి యవమాన మెవఁడు స ♦ హింపనేర్చు?
బళిర! చెంచెత యనిమాత్ర ♦ పల్కినారు. ౨౭౭

సవరలనుపేర నీనాఁడు ♦ జయపురమునఁ
గిమిడికొండలఁ దెల్గు నాఁ ♦ ట మనుజాళి
కలరు వారినే ప్రజలెల్లఁ ♦ బిలిచినారు
వానరులని తొల్లి యెఱుఁగ ♦ వా? కుమార! ౨౭౮

నాఁటి శబరులే యీనాఁటి ♦ సవరులైరి
నాఁటి కారుకుప్పమ్మలు ♦ నాఁటిగవులె
నేఁటికిని మన్కిపట్టులె ♦ నెగడుచుండె
నాగరికత యొక్కవిధంబు ♦ నాఁడు నేఁడు. ౨౭౯

పదంపడి పథిశ్రమంబు సరకుఁగొనక. ౨౮౦

శబరి యాతిథ్యము గ్రహింప ♦ సంభ్రమించి
రామలక్ష్మణు లభిరామ ♦ రామఁగూడి

ముచ్చెమట లట్టె దిగజారఁ ♦ బోయఁబోయి
యేతదాశ్రమభూమికి ♦ నేగి నిల్వ. ౨౮౧

మునివర్యులు చెప్పిన యడియాలంబుచే సీతారామలక్ష్మణులఁ బోడగాంచి గుర్తించి, పరమానందకందళితహృదయయై శబరి. ౨౮౨

వంగిన పండ్లకొమ్మలను ♦ బట్టి విదల్చుచుఁ గొన్నిపండ్లనున్
జెంగునఁగోయుచున్ గొఱికి ♦ చెడ్డవొ మంచివొ యంచుఁజూచి యా
యెంగిలిపండ్లనున్ రఘుకు ♦ లేశునకిచ్చినఁ దోషుతోడను
పొంగుచు వానిసిందినియె ♦ భూవరుఁ డాఁకలిచేతదూఁటుచున్.

ద్రవిడలోకంబునందెల్ల ♦ దప్పి దారి
యాభిజాత్యంబుఁ గోల్పడ్డ ♦ యట్టి శబరి
యెంగిలి భుజించె శ్రీరాముఁ ♦ డేవపడక
కార్యపరులకు నెగ్గులు ♦ కలవె? చెపుమ. ౨౮౪

ఆర్యమునుల యుచ్ఛిష్టంబు ♦ నహరహంబు
కుడిచి దేహంబుఁ బోషించు ♦ కొనియెఁగాన
నామెయెంగిలిఁ దిన దోష ♦ మేమియుండు?
యుమ్మి యుమ్మిలోఁ గలసిన ♦ ట్లుండుఁగాక! ౨౮౫

శబరి భక్తిని గనిపెట్టి ♦ సంతసించి
కంటిచూపుతో మోక్షంబుఁ ♦ గట్టిపెట్టె
శంబుకుని తపంబును మెచ్చి ♦ సాహసించి
కత్తివేటుతో మోక్షంబుఁ ♦ గట్టిపెట్టె. ౨౮౬

తదనంతరంబు సీతాలక్ష్మణసహితుండై శ్రీరాముండు. ౨౮౭

పలువరెుండల కెండి వా ♦ నలకుఁ దడిసి
తులువ మెకముల బొబ్బరిం ♦ తలకు జడిసి
యేమిచేయంగఁ దోఁచ కొ ♦ క్కొంత తడసి
బయలుదేరి యాకానలోఁ ♦ బాడుదారి. ౨౮౮

ముదురు వెదురుప్రాలు ♦ ముర్వుతో భుజియించి
పుట్టతేనెఁ ద్రావి ♦ పొట్టనిండ
మడ్డియిప్పకల్లు ♦ లడ్డిగం బంకించి
ముగ్గు రడవినడచి ♦ పోయి పోయి. ౨౮౯

ఏదుబందులు సివ్వంగు ♦ లెలుఁగుబంట్లు
క్రేళ్లువారుకుందేళ్లు తో ♦ డేళ్లు లేళ్లు
చిఱుతపులులు బెబ్బులులెల్లఁ ♦ దిరుగుచుండు
కారడవిఁ గాళ్ళు బలపాలు ♦ కట్టఁ దిరిగి. ౨౯౦

నానుడు వానలచేతన్
నానినఁ జేయెత్తుపెఱిగి ♦ న తఱచుపులులో
మానక డాఁగుడుమూఁతల
లోనమునిఁగి తేలు మెకము ♦ లు గలుగుచోటన్. ౨౯౧

ఇంటిపట్టునకు ననువైన పట్టులం గనుంగొనఁజాలక విసుగుచేఁ
బోయిన పోకగాఁ బోవుచుండ నొక్కనాఁడు. ౨౯౨

దాపునఁ బర్ణశాల తమ ♦ దారిని నొక్కటి కానుపింప నా
వైపునకేగి యందు ముని ♦ వర్యుఁ డగస్త్యుఁడు భార్యతోడుతన్
గాపురమున్న మాటెఱిఁగి ♦ క్రన్నన చూచుట మేలటంచు న
ల్తాపసిసమ్ముఖంబునకుఁ ♦ దద్దయు నేగిరి ముగ్గురొక్కటై. ౨౯౩

ఏగి, కులగోత్రనామంబులు చెప్పుచుఁ దమ్మెఱింగించికొని సాష్టాంగముగాఁ బ్రణమిల్లిన నపరిమితానందముఁ బొంది యగస్త్యుఁడు వారల దీవించి, భూతభవిష్యద్వర్తమానంబు లెఱింగిన యాతండు శ్రీరామచంద్రునిచే నిఖిలంబెఱింగి, కొంతవడి వగచి, యెఱుక కలవాఁడు గావున వగపుడిగి శ్రీరామచంద్రునితో.

జటిలవరుఁడు త్రొక్కటఁబడి ♦ యిటులఁబల్కె
నిటకు మందటఁ బిప్పలీ ♦ జటిలమైన
పంచవటి నాఁగ వెల్గెడి ♦ వనమొకండు
వాసయోగ్యంబు మీఁబోఁటి ♦ వారికదియు. ౨౯౫

చెక్కుచెమర్పకుండఁగ వ ♦ సింతురు పెక్కురు మానులచ్చటన్
నిక్కిన చెట్లనీడ నవ ♦ నీపతిపుత్రకులార! మీరటన్
మిక్కిలిచిత్తశాంతిని గ ♦ మింతురు మింతురు మేలుగాంతురీ
రిక్కడనుండి పోసిచనుఁ ♦ డీ! మునిదర్శన లాభమానసన్. ౨౯౬

మునితల్లజు ననుమతినిం
గొని రాఘవు లవనితనయఁ ♦ గొని గొనకొని వెం
టనె పైనమయిరి పంచవ
టిని జేరఁగ దెన్నెఱఁగివ ♦ డిన్ గాలినడన్. ౨౯౭

పంచవటిఁ జేరి యటనొక్క ♦ పర్ణశాలఁ
గట్టికొని రాముఁ డందుండెఁ ♦ గాపురంబు
సీతయును లక్ష్మణుండును ♦ జెంతనుండఁ
గడచిపోయిన కార్యముల్ ♦ దఁవికొనుచు. ౨౯౮

తనజాతి తనకులం ♦ బనువారు గనరాని
ప్రొద్దుపొడుపులేని ♦ భూములందు
ఓరుగాలి చెలంగి ♦ యుయ్యాల లూఁగించు
పాఱుటాకుల కప్పు ♦ పాకలందుఁ

గాపురంబుండ నే ♦ కాకియై యొకనాఁడు
మాలిమితో నొక్క ♦ మాలకాకి
పర్ణశాలనుదూరి ♦ వసుధాతనూజాత
బెదరించి కొట్టిన ♦ పీడకున్న

భర్తతో నెన్నిమొక్కులో ♦ పల్కిపల్కి
కాకిఁ జంపించి ముంగిటఁ ♦ గాకిగడకుఁ
గడకుఁ గట్టించె నది జారి ♦ పడకయుండఁ
దమకు నేదృష్టి దోషంబు ♦ తగులదనుచు. ౨౯౯

పులుఁగులందుఁ గాక ♦ ములను ద్రావిడులు పూ
జింతురనుచుఁ బ్రేమఁ ♦ బెంతురనుచు
నెఱిఁగియుండి చంపె ♦ నృపతిచంద్రుండు ద్రా
విడులతోడఁ బోరుఁ ♦ బెట్టుకొనఁగ. 300

కాఱుచీకట్లు దిశలెల్లఁ ♦ గ్రమ్ము వేళ
గొఱ్ఱెమందను గాచెడి ♦ గొల్లవోలె
వదినె యన్నయు నిదురించు ♦ పర్ణశాలఁ
గాచుచుండుఁ దమ్ముఁడు నిద్ర ♦ గాంచకుండ. ౩౦౧

ఇనుపగుద్దలి యొకచేత ♦ నెనయుచుండ
నురులు మూపుపై వ్రేల్లాడు ♦ చుండ నొక్క
దినము కందమూలంబులు ♦ దెచ్చుపనికి
నినకులుండైన సౌమిత్రి ♦ యేగుచుండ. 30౨

సునిశిత చంద్రహాస మొక ♦ చోటఁగనంబడ దారిలోపలఁ
గనుకని మందహాసమునఁ ♦ గైకొని జెచ్చెర వాయి యెట్టిదో
కనుఁగొనఁగోరి యాత్రపడి ♦ కాచినమేలిమి ధారుణీజ పా
ళిని బడఁగొట్టుచుండఁగఁ జ ♦ లింపక దక్షిణబాహుశక్తిచే. 303

ప్రక్కనుగల్గునట్టి ముని ♦ పల్లెలనుండిన మానులెల్లరున్
గ్రక్కునవచ్చి యేమిపని? ♦ కారుణికోత్తమ! పూచికాయు నీ
చక్కని పండ్లచెట్లఁ బెలు ♦ చన్ బడఁగూల్చెదవేల? యిప్డు మా
చిక్కులుదీర నొక్కపనిఁ ♦ జేయుము మాయెడఁ బేర్మిఁజూపుచున్.

అదె! వెదురుపొద యెదురుగాఁ
బొద! పొద!! యచ్చోటకీవు ♦ పొదపడఁ జదుపన్
సొదవదలెడి నందేదులు
పొదలును సరకుగొనవెట్టి ♦ పోటరినైనన్. ౩౦౫

అనిన నటకేగి యతఁడు బా ♦ హాప్పలించి
చిప్పకత్తి వాదర సరి ♦ చేసి చూచి
పటుతరంబైన దక్షిణ ♦ బాహువెత్తి
వ్రేటుతోడనే పడగూల్చె ♦ వెదురుపొదను. ౩౦౬

చూరకత్తిపై నెత్తుటి ♦ జారలుండె
వెదురుప్రాలు రక్తాక్షత ♦ వితతియయ్యెఁ
గాంచినంతనే లక్ష్మణు ♦ కన్ను చెదరె
నెంతపాపంబుఁ జేసితి ♦ నెట్టులనుచు. ౩౦౭

ఇటునటు పరికించినయం
తట మెడతెగిపడ్డ మౌని ♦ నాథుండొకఁడున్
దటుకునఁ బొడగట్టిన ముం
దట గడగడలాడి లక్ష్మ ♦ ణ కుమారకుఁడున్. ౩౦౮

ఎలుఁగురాల్పడః గన్నీరు ♦ కొలుకులందు
ముత్తియములట్టు కన్పట్ట ♦ ముసుఁగువెట్టి
పర్ణశాలకు సైదోడు ♦ పజ్జకేగి
పాదయుగళంబుపై వ్రాలి ♦ పనవి పనవి. ౩౦౯

అన్నన్న! ఘోరపాపం
బన్నా! యొనరించినాఁడ ♦ నజ్ఞుఁడనై యీ
పన్నుఁడ ననుఁగావుము నీ
కన్నను దిక్కెందుఁగలదు? ♦ కారుణ్యనిధీ. ౩౧౦

వెదురుపొదలోనఁ గూర్చుండి ♦ విప్రుఁడొకఁడు
దీర్ఘతపముఁ జేయుఁగఁ దలఁ ♦ ద్రెళ్లిపడియె
వంశనాశంబుఁ జేయంగ ♦ వంశనాశ
మగునొ! శ్రీరామ యీ బ్రహ్మ ♦ హత్యచేత. ౩౧౧

నిష్కారణముగ నెఱుఁగక
దుష్కృత్యముఁ జేసినాఁడ ♦ దుందుడుకొప్పన్
నిష్కృతి కల్గినయెడలఁ బ
రిష్కృతి యొనరించి యుద్ధ ♦ రింపుఁడు నన్నున్. ౩౧౨

అనవుడు రామచంద్రుఁడక ♦ టా! యెటువంటి ప్రమాదమయ్యె దు
ర్జనులనుగూల్చి ధర్మ పరి ♦ రక్షణముం బొనరింపనున్న యీ
మన కిటువంటి సంకటము ♦ మాయు రె! రాఁదగునే కుమార? యే
మనియెద నేమితోఁచదు క♦దా!యని యాఱటఁబల్కుచుండఁగన్.

మునివరులు పర్ణశాలకుఁ
జనుదెంచుచు బ్రహ్మహత్య ♦ సల్పెఁడహో నీ
యనుజుఁడు తలఁదెగి కూలిన
మనుజుఁడు బ్రాహ్మణుఁడుకాఁడు ♦ క్ష్మాతలనాధా. ౩౧౪

దొంగబ్రాహ్మణుం డాతండు ♦ దొంగ తపసి
రావణానుజయైన శూ ♦ ర్పణఖ సుతుఁడు
కినియువాఁడు జంబుకుమారుఁ ♦ డనెడివాఁడు
వానిఁ జంపినమాత్ర పా ♦ పంబులేదు. ౩౧౫

నావివి మోదమందె నర ♦ నాథుఁడు లక్ష్మణుఁ డంతమీఁద మో
దావహుఁడయ్యెఁ దప్పినుగ ♦ దా! మనమేర్చెడి బ్రహ్మహత్య నేఁ
డీవిధినంచు మానిజన ♦ మేగెను బిమ్మట నొక్కఁడొక్కఁడున్
భూవరు మోసపుచ్చి పోరి ♦ పుచ్చఁగ నేర్చితిమంచు నొక్కనిన్.

ప్రథిత లంకాధిపతియైన ♦ రావణునకు
మాఱుచెల్లెలు జంబుక ♦ మారుతల్లి
ఖరునితోడఁ బుట్టువు పరా ♦ మరికగలది
యనఁటి గొడ్డురాలాభిజా ♦ త్యంబుకలది. ౩౧౬

ప్రాయంబు సుంత గై ♦ వ్రాలకుండిననాఁడె
దొమ్మిఁగోఁ దనభర్త ♦ ద్రుంగిపోవ
సతతశుష్కోపవా ♦ సములచేఁ గడుడయ్యు
నేండ్లు పూండులు చాల ♦ నెగిరిపోవ
మోటువారిన మోము ♦ ముడుత గగ్గులచేత
ముసలితనమ్ముచేఁ ♦ బుల్లసిల్ల
తూఁగాడు రొండిచే ♦ దుద్దెక్క పొరడుచేఁ
గడువగ్గు గబ్బుచే ♦ నొడలుదనర

చూపరుల కేవ పుట్టించు ♦ చుప్పనాక
బిడ్డపైఁ గల్గు కూరిమి ♦ వీడలేక
యకట! దండకాటవియందు ♦ నాకు పాక
లందుఁ గాపురముంజేయు ♦ నెందుఁబోక. ౩౧౭

కామదేవున కెన్నఁడో ♦ కాన్కలిచ్చి
సాఁగనంపి వైరాగ్యంబు ♦ సంగ్రహించి
పారలౌకిక చింతచే ♦ బ్రదికియుండెఁ
జుట్టపక్కాల దరిఁబోక ♦ చుప్పనాక. ౩౧౮

ఒక్కగా నొక్కబిడ్డ మ ♦ హోగ్రతపము
సలుపుచుండంగ లోలోన ♦ జాలిఁబొంది
పూలఁబండ్లను నందిచ్చి ♦ పోవుచుండుఁ
గొండిక తపంబు చాలించి ♦ యుండునపుడు. ౩౨౦

రుచిరఫలంబులన్ నెమకి ♦ రోసి ప్రియంబున నేరితెచ్చి మం
చి చవి గలట్టి దుంపలను ♦ జేకొని మిక్కిలి దేవపూజకై
యుచితములైన పూవులను ♦ నొక్కదినంబునఁ గూర్చితెచ్చి సా
ధుచరితమైన శూర్పణఖ ♦ తొట్రిలుచుం జనుదెంచి చూచుచున్.

కొడుకు గానఁబడఁడు ♦ కొడుకున్న వంశంబు
కుప్పగూరగాఁగఁ ♦ గూలియుండెఁ
జుట్టుప్రక్కపొలము ♦ శోధింప మొదలిడె
గుండె కొట్టుకొనఁగఁ ♦ గొడుకుకొఱకు. ౩౨౧

అటునిటు చూచుచున్న సమ ♦ యంబునఁ దేజనమధ్యమందును
త్కటపటుశోకముం గొలుపఁ ♦ గాఁగనుపించెను మొండెమొక్కచో
బొటబొట కంటివెంటఁబడి ♦ బొట్టులు గారెను నేకధారగా
వికటతటమైన డెందమున ♦ వెంగలియైచనె నేమిచెప్పుదున్. ౩౨౨

కొడుకు శవముమీఁదఁ ♦ గూలియాక్రోశించి
తలను మోదుకొంచుఁ ♦ దల్లియపుడు
గొడుగొడుమంచు ♦ గొంతెత్తి పలవించి
యేడ్వ లేక చివర ♦ కేడుపుడిగి. ౨౩౩

ప్రక్కఁదపర్చునట్టి ముని ♦ పల్లెకుఁ బోయి యిదేమి పాపమో
యిక్కడఁగించిపోయె నెవఁ ♦ డో యొకదుష్టుఁడు నాకుమారునా
యుక్కువుఁ డెవ్వఁడో తెలుప ♦ కుండిరయేని త్వదీయ జీవముల్
దక్కవు చెప్పుఁడన్న ముని ♦ తల్లజు లందఱు నొక్కపెట్టునన్

ఎఱుఁగము తల్లి! నీసుతుని ♦ నెవ్వరు చంపిరో క్రూరకర్ములై
యెఱుఁగము నీతనూజుమృతి ♦ యెన్నఁడుకల్గెనో కాని యెవ్వరో
యిరువురు పర్ణశాల వసి ♦ యింపుచునుండిరి యొక్కతన్వితో
నెఱుఁగక వారలేమయిన ♦ నీయెడ నీపనిఁ జేసియుండిరో. 3౨౭

కడుపుచిచ్చార్చుకొనుటకై ♦ కందమూల
ములు మెసవి నీరుఁదెగఁ ద్రావి ♦ పొట్టనిండఁ
బ్రొద్దులను బుచ్చుచున్న మా ♦ బోంట్లకమ్మ!
పరులఁ జంపఁ జేయాడునే ♦ పాపమనక? 3౨౮

గొబ్బునఁ బర్ణశాల కడ ♦ కుంజని వారలఁ బృచ్ఛసేయు నీ
యబ్బిని దొంగపోటున గ ♦ తాసునిజేసిన వారలున్నచో
దబ్బఱలాడకుండఁగ య ♦ థార్థము నీకెఱిఁగింతురమ్మ యి
ట్లబ్బరపోయినందునఁ బ్ర♦యోజనముండునె? యంచుఁ దెల్పఁగన్.

వగ్గుతనంబుచే నడుము ♦ వంగిన దేహము తూలుచుండఁగా
నగ్గముకాని శోకమున ♦ నంగములన్నియుఁ గంపమొందఁగా
నెగ్గులెఱుంగనట్టి తన ♦ కీయగచాట్లు ఘటిల్లెనంచునున్
గగ్గుచుఁబోయె శూర్పణఖ ♦ కాకులుదూరెడి పర్ణశాలకున్. 3౨౯

సీతతోడఁగూడి ♦ శ్రీరామచంద్రుండు
సుద్దులాడుచున్న ♦ చోటికఱిగి
చుప్పనాక తొంగి ♦ చూడఁగాఁ గనిపెట్టి
సీతనవ్వె నొక్క ♦ చెనఁటి నవ్వు. 330

శూర్పణఖయు, సీత వెడనవ్వు చీఁకిఁగొనక శ్రీరాము నుద్దేశించి "మీారలెవ్వరో యెఱుంగ; పరమతపోనిరతుండును, జీవహింసా పరాఙ్ముఖుండును, నాయేకపుత్రుండు నగు, జంబుకుమారుండు తుత్రిటితమస్తకుండై ధరం గూలియున్నవాఁడు మునిపల్లెనున్నవారి

నడుగ నా కుమారహంతకుని మీరెఱింగియుండనోపుదురని వాకోన నిటకు వచ్చితి. కన్నకడుపుగాన నూఁడునీర్చ వేగిరపడుచుంటి. మీ రెఱింగినఁ దెల్పి ధన్యులుకండు. ప్రతాపలంకేశ్వరుని సోదరిని జెనకి బ్రిదికిపోవుట సుకరముకాదు. ఎఱుంగఁ జెప్పుచుంటి” ననవుడు శ్రీరాముండు “మేమెఱుంగుదుము. ఆతఁడు మునిజనాపకారియగుటచే మాచే నిహతుండయ్యె” నని చెప్ప మిన్ను విఱిగి నూలినట్లు నివ్వెఱఁ గంది శూర్పణఖ దుస్సహశోకాతిరేకంబునఁ గ్రోధవివశయై, “ముని జనాపకారియని యపవాదంబుఁ గల్పించి నిరపరాధుని జంపి సిగ్గిలకుంటి రేల? మీరు హంతవ్యులు. ద్రావిడరాజపుత్రికలు పరాభవంబు నీగం జాలుదురని మెఱుంగరు కాఁబోలు,” నంచు మొలనున్న చురియం బెఱికి మీఁదికిఁబోవ’ సీత కెవ్వునకేకవేయ శ్రీరాముం డులికిపడి, శూర్పణఖకరంబు కరంబున నిఱికించి గట్టిగాఁ బట్టుకొని, యుడంచి యుంచిన, సౌమిత్రి చనుదెంచి, పెడకేలు విఱిచికట్టి రామాజ్ఞచే నిస్స హాయయైన యబలను, శతవృద్ధను ముక్కుచెవులుంగోసి, విరూపంజేసి, క్షత్రధర్మమును నిర్వహించి విడిచిపుచ్చెను. అంత శూర్పణఖ కనలు రాజ, రోజుచుఁ బొగులుచు నడవులంబడి సోదరుండగు ఖరుని జేరి తన పరాభవంబు విన్పింప, నతండు మండిపడి, రామునిపైకి దండెత్తివచ్చి, ఘోరయుద్ధంబున మృతుండయ్యె. ౩౩౧

ఖరుని చావుఁజూచి ♦ కాలుసేయాడక
యడవి నిలువలేక ♦ యడలలేక
చీరచెఱఁగు కాళ్ళఁ ♦ జీరాడు చుండఁగా
నింతి యపుడు లంక ♦ కేగి పిదప. ౩౩౨

రావణభూమినేతకుఁ బ ♦ రాభవమెల్లను మూలమట్టుగా
గావురుమంచుఁ జెప్పి ప్రతి ♦ కారముఁ జేయుచు బన్నమీఁగఁగాఁ

భావనమైన ధర్మమని ♦ పల్కినయంతట రావణుండు కో
పావిలమానసుండయి.యు ♦ హంకృతిహుంకృతిఁ జేసియార్చుచున్.

అంతరంగికసచివుండయిన మారీచునిఁ బిలిపించి,మంతనంబాడి, రాజపుత్రికయు నందు నాసోదరియు నగు శూర్పణఖయెడ రామలక్ష్మణు లొనరించిన యవమానము నన్నాపాదమస్తకంబు దహించుచున్నది. మఱియు నిఖిలద్రావిడలోక మనస్సంతాపంబుఁ జేయు వాయసవధ నన్ను నిలువున నీఱుచేయుచున్నది. ప్రతీకారంబు తప్పనిపని. కావున స్త్రీయెడ వీరపురుషానుచితమైన కార్యంబు సల్పినవాఁడు గావున శ్రీరామచంద్రునకు స్త్రీ మూలకంబయిన పరాభవంబుఁజేయుట సమంచితధర్మమని నిశ్చయించి, కార్యక్రమంబు మారీచున కుపదేశించి పంపెను. అటుపిమ్మట మారీచుండు దక్షిణాపథంబునకుఁ జని మాయాకురంగరూపంబున, రామలక్ష్మణుల దవ్వుల కెలయించి కొంపోవ నాయదనున రావణుండు పర్ణశాలనున్న సీతను మునివేషంబున, బ్రుచ్చిలికొంపోవుచు దారికడ్డంబయిన జటాయువుం దునిమి, యుత్తుంగాభంగభంగయగు దక్షిణోదధి దాఁటి స్వకీయాభ్యంతరమందిరంబునకుఁ గొంపోయి, డించి, తన మనంబున నిట్లు తలపోసెను. ౩౩౮

పతియున్న పరకాంత ♦ బదరించికొని తెచ్చి
కొనియింటిలో నుంచి ♦ కొనుట తప్పు
భావింప లోకాప ♦ వాదంబు తప్ప దీ
కఱటిలోకంబు వా ♦ కట్టరాదు
కాన సీతాదేవిఁ ♦ గంకేళి తోఁటలో
వీటికిఁ బరగడఁ ♦ బెట్టియుంచి
రాజపుత్రికగాన ♦ రామకుం దగినట్లు
రాణివాసంబు కొ ♦ ఱవడకుండఁ

గాలయాపనఁ జేయంగఁ ♦ గాపు వెట్టి
యుంతు మా త్రిజటను సీత ♦ యొద్దననుచుఁ
బండితుండైన రావణ ♦ ప్రభువరుండు
నిబ్బరించి యాత్రపడక ♦ నిర్ణయించి. ౩౩౫

సీత నశోకవనికామధ్యంబున నుంచి, తమ్ముని కుమార్తె యగు త్రిజటను గావలియుంచి యవిచారిత మనస్కుండై వీతమనశ్శల్యుండై లంకలోఁ గాలక్షేపంబుఁ జేయుచుండె. ౩౩౬

త్రిజగములెల్లఁ గెల్చి గడి ♦ దేరిన లౌకికశేఖరుండు భూ
ప్రజలకుఁగూర్చుభూవరుఁడు♦రావణుఁడెంత యమాయకుండొ యా
త్రిజటను నమ్మి మోసపడి ♦ దెబ్బునఁ గావలియుంచి సీతకుఁ
గజిబిజిగాఁగఁ జేసికొనెఁ ♦ గా! తనలంకను దెప్పపాటులో. ౩౩౭

ఇచ్చట రామచంద్రి ధర ♦ ణీశుఁడు భార్యను గోలుపోయి యే
మచ్చుననేని శోకమును ♦ మానఁగలేక విషణ్ణచిత్తుఁడై
యెచ్చటఁ గాననౌనొయని ♦ యేగెను రోయుచు గాననంబులఁ
బొచ్చెములేని సోదరుఁడు ♦ మూల్గుచు భక్తిని గొల్చి వెంటరా.

ఇట్లు పోయినపోకఁగాఁ బోయి యరణ్యంబులన్నియు గాలించి, వైదేహినిం గానక పొగులుచున్న రామలక్ష్మణులకు, రావణునిచేఁ గూల్పంబడి కొనప్రాణములతో నున్న పితృసఖుండగు జటాయువు సీతాసమాచారంబు విన్పింపఁ దిన్నఁగా నటేగి వారిర్వురు ఋష్యమూకపర్వతంబుఁ జేరి, దట్టమగు నొక్క పిప్పలిచెట్టు నీడఁబడియున్న రచ్చబండపైఁ గూర్చుండిరి. మంత్రిపరివృతుఁడై యందు సంచారంబుఁ జేయుచున్న సుగ్రీవుండు దూరముననుండి వీరింజూచి భయకంపితగాత్రుఁడై. ౩౩౯

కంటివె! యాంజనేయ! రణ ♦ కర్కశు లిర్వురు చాపధారులై
యొంటరిగాఁగఁ జెట్టుకడ ♦ నుండిరె! యేపనిఁగోరి వచ్చిరో
తుంటరు లెవ్వరేని యిటు ♦ తోడ్కొనివచ్చిరొ కీడుసేయఁగా
వెంటనె పోయి వారల ప్ర ♦ వృత్తిని నీవుగ్రహించి రాఁగదే.

బాల్యమునందు నీవు ముని ♦ పల్లెలయందు వసించి చాలఁ గౌ
శల్యముతోడుతం జదువు ♦ సాములునేరిచి యార్యభాష సా
కల్యముగా నెఱింగితివి ♦ గావున నిప్పుడు వారితోడఁ జా
పల్యములేని మాటలను ♦ బల్కి నిజంబును సంగ్రహింపుమా.

ఆర్యుల పొత్తియున్నయది ♦ యం విలుకాండ్రమొగంబునందు నా
రార్యులె యౌదు రీక్షణము ♦ యచ్చటికిం జని యెట్టులేని నా
కార్యముదీర్పఁగాఁ దగిన ♦ గట్టుపకాసువు సందియంబులే
దార్యమనంబు నీవెఱిఁగి ♦ నట్టోరు లెవ్వ రెఱుంగలేరనన్.

జేనిముదల నొఁదలఁదాల్తు ♦ నేనటంచు
వారి యాచారము లెఱుంగు ♦ వాఁడనంచు
గాలిగాఁబుట్టి పెఱిగిన ♦ గాలికొడుకు
గాలినడనేగె రామల ♦ క్ష్మణులకడకు. ౨౫౨

తిన్నఁగా రామలక్ష్మణులం జేరి యందందు నిలిచి వందన బాచరించుచుఁ, దావచ్చిన పని వినయోక్తుల విన్నవించి, వారివలన సర్వంబెఱిఁగి, సుగ్రీవునితో సఖ్యంబు సమకూర్ప నిశ్చయించి, బుఽ్య మూకంబునకుఁ దోడ్కొనిపోయి, కొమ్మలరాపిడిచే నగ్నిని బుట్టించి, యగ్నిసాక్షిగా రామలక్ష్మణసుగ్రీవులకు సఖ్యంబుఁ గావించిన పిమ్మట నొండొరుల భార్యల నొకొళ్ళొకళ్ళిప్పించుకొనుటకు బాసఁజేసికొని రని సూతుం డానతీయ, దేశికేంద్రా! మీరు చెప్పిన వాక్యార్థ బు బోధపడదయ్యె. విశదీకరించి చెప్పవే యనవుడు సూతమహా ఋ యిట్లు చెప్పఁ దొడంగెను. ౨౫౩

వాలిన శక్తిచే ♦ వాలిని బడఁగూల్చి
రుమను వానరరాజ్య ♦ రమనుదెచ్చి
భద్రింబుగా రామ ♦ భద్రుండు సుగ్రీవు
నకునిచ్చి మాటఁదీ ♦ ర్చికొనుటకును
సుగ్రీవుఁ డామీఁద ♦ సుదతి సీతాదేవి
యేనాఁట నుండెనో ♦ యెఱిఁగివచ్చి
బవరంబు గావింప ♦ వచ్చినఁ గావించి
తెచ్చి శ్రీరాముడ ♦ కిచ్చుటకును

బాసఁజేసికొనిన పిద ♦ ప రవిసుతుఁడు
సింహనాదంబుఁ జేసి కి ♦ ష్కింధ కేగి
దురముఁజేయంగ వాలిని ♦ దోడితేరఁ
గాంచి శ్రీరామచంద్రుండు ♦ కంపమెత్త. ౩౮౫

ఎదురై వాలిని డీకొని
కదనంబున నొడిసిపుచ్చఁ ♦ గష్టంబనుచున్
బొదమాటున బొంచి మహా
ప్రదరంబున వాలిఁ జంపి ♦ వైచినపిదపన్ ౩౮౬

రామచంద్రుండు స్వార్థప ♦ రత్వబుద్ధి
నతుల వానరరాజ్య ప ♦ ట్టాభిషిక్తుఁ
జేసె సుగ్రీవుఁ బ్రథిత కి ♦ ష్కింధ నంత
సోదరుని భార్య సుగ్రీవుఁ ♦ డుంచుకొనియె. ౩౮౭

తమ్మునిదారఁగైకొనె మ ♦ దమ్మున వాలియటంచు బాణపా
తమ్మున వానినిం దునిమి ♦ ధర్మమునిల్పెనటందు్రి మోహగీ

ఎఱుఁగము తల్లి! నీసుతుని ♦ నెవ్వరు చంపిగో క్రూరకర్ములై
యెఱుఁగము నీతనూజమృతి ♦ యెన్నఁడు కల్గెనో కాని యెవ్వరో
యిరువురు పర్ణశాల వసి ♦ యింపుచునుండిరి యొక్క తన్వితో
నెఱుఁగక వారలేమయిన ♦ నీయెడ నీపనిఁ జేసియుండిరో. ౩౨౬

కడుపుచిచ్చార్చుకొనుటకై ♦ కందమూల
ముల మెసవి నీరుఁ దెగఁ ద్రావి ♦ పొట్టనిండఁ
బ్రొద్దులను బుచ్చుచున్న మా ♦ బోంట్లకమ్మ!
పరులఁ జంపఁ జేయాడునే ♦ పాపమనక? ౩౨౭

గొబ్బునఁ బర్ణశాల కడ ♦ కుంజని వారలఁ బృచ్ఛసేయు నీ
యబ్బిని దొంగపోటున గ ♦ తాసునిజేసిన వారలున్నచో
దబ్బఱలాడకుండఁగ య ♦ థార్థము నీకెఱిఁగింతురమ్మ యి
ట్లబ్బురపోయినందునఁ బ్ర♦యోజనముండునె? యంచుఁ దెల్పఁగన్.

వగ్గుతనంబుచే నడుము ♦ వంగిన దేహము తూలుచుండఁగా
నగ్గముకాని శోకమున ♦ నంగములన్నియుఁ గంపమొందఁగా
నెగ్గులెఱుంగనట్టి తన ♦ కీయగచాట్లు ఘటిల్లెనంచునున్
గగ్గుచుఁ బోయె శూర్పణఖ ♦ కాకులుదూరెడి పర్ణశాలకున్. ౩౨౯

సీతతోడఁగూడి ♦ శ్రీరామచంద్రుండు
సుద్దులాడుచున్న ♦ చోటికఱిగి
చప్పనాక తొంగి ♦ చూడఁగాఁ గనిపెట్టి
సీతనవ్వె నొక్క ♦ చెనఁటి నవ్వు. ౩౩౦

శూర్పణఖయు, సీత వెడనవ్వు చీఁకింగొనక శ్రీరాము నుద్దేశించి “మీరలెవ్వరో యెఱుంగ; పరమతపోనిరతుండును, జీవహింసా పరాఙ్ముఖుండును, నాయేకపుత్రుండు నగు, జంబుకుమారుండు త్రుటితమస్తకుండై ధరం గూలియున్నవాఁడు మునిపల్లెనున్నవారి

నడుగ నా కుమారహంతకుని మీ రెఱింగియుండనోపుదురని వాకోష నిటకు వచ్చితి. కన్నకడుపుగాన నూడుదీర్ప వేగిరపడుచుంటి. మీ రెఱింగినఁ దెల్పి ధన్యులుకండు. ప్రతాపలంకేశ్వరుని సోదరిని జెనకి బ్రదికిపోవుట సుకరముకాదు. ఎఱుంగఁ జెప్పుచుంటి" ననవుడు శ్రీరాముండు "మేమెఱుంగుదుము. అతఁడు మునిజనాపకారియగుటచే మాచే నిహతుండయ్యె" నని చెప్ప మిన్ను విఱిగి మీఁదబడ్డట్లు నివ్వెఱఁ గంది శూర్పణఖ దుస్సహశోకాతిరేకంబునఁ గ్రోధవివశయై, "ముని జనాపకారియని యపవాదంబుఁ గల్పించి నిరపరాధుని జంపి సిగ్గిలకుంటి రేల? మీరు హంతవ్యులు. ద్రావిడరాజపుత్రికలు పరాభవంబు సైరిం జాలుదురని యెఱుంగరు కాఁబోలు," నంచు మొలనున్న చురియం బెఱికి మీఁదికిఁబోవ' సీత కెవ్వనకేకవేయ శ్రీరాముం డులికిపడి, శూర్పణఖకరంబు కరంబున నిఱికించి గట్టిగాఁ బట్టుకొని, యడంచి యుంచిన, సౌమిత్రి చనుదెంచి, పెడకేలు విఱిచికట్టి రామాజ్ఞచే నిస్స హాయయైన యబలను, శతవృద్ధను ముక్కు చెవులుంగోసి, విరూపంజేసి, క్షత్రధర్మమును నిర్వహించి విడిచిపుచ్చెను. అంత శూర్పణఖ కనలు రాజ, రోజుచుఁ బొగులుచు నడవులంబడి సోదరుండగు ఖరుని జేరి తన పరాభవంబు విన్పింప, నతండు మండిపడి, రామునిపైకి దండెత్తివచ్చి, ఘోరయుద్ధంబున మృతుండయ్యె. 33౧

ఖరుని చావుఁజూచి ♦ కాలుసేయాడక
యడవి నిలువలేక ♦ యడలలేక
చీరచెఱఁగు కాళ్ళఁ ♦ జీరాడు చుండఁగా
నింతి యపుడు లంక ♦ కేగి పిదప. 33౩

రావణభూమినేతకుఁ బ ♦ రాభవమెల్లను మూలమట్టుగా
గావురుమంచుఁ జెప్పి ప్రతి ♦ కారముఁ జేయుచు బన్నమీఁగఁగాఁ

బావనమైన ధర్మమని ♦ పల్కినయంతట రావణుండు కో
పావిలమానసుండయి.యు ♦ హుంకృతిహుంకృతిఁ జేసియార్చుచున్.

ఆంతరంగికసచివుండయిన మారీచునిఁ బిలిపించి,మంతనంబాడి, రాజపుత్రికయు నందు నాసోదరియు నగు శూర్పణఖయెడ రామ లక్ష్మణులు లొనరించిన యవమానము నన్నాపాదమస్తకంబు దహించు చున్నది. మఱియు నిఖిలద్రావిడలోక మనస్సంతాపంబుఁ జేయు వాయసవధ నన్ను నిలువున నీఱుచేయుచున్నది. ప్రతీకారంబు తప్పనిపని. కావున స్త్రీయెడ వీరపురుషానుచితమైన కార్యంబు సల్పినవాఁడు గావున శ్రీరామచంద్రునకు స్త్రీ మూలకంబయిన పరాభవంబుఁజేయుట సమంచితధర్మమని నిశ్చయించి, కార్యక్రమంబు మారీచున కుపదేశించి పంపెను. అటుపిమ్మట మారీచుండు దక్షిణా పథంబునకుఁ జని మాయాకురంగరూపంబున, రామలక్ష్మణుల దవ్వుల కెలయించి కొంపోవ నాయదనున రావణుండు పర్ణశాలనున్న సీతను మునివేషంబున, ప్రుచ్చిలికొంపోవుచు దారికడ్డంబయిన జటా యువ్వుం దునిమి, యుత్తుంగాభంగభంగయగు దక్షిణోదధి దాఁటి స్వకీయాభ్యంతరమందిరంబునకుఁ గొంపోయి, డించి, తన మనంబున నిట్లు తలపోసెను. 334

పతియున్న పరకాంత ♦ బదరించికొని తెచ్చి
కొనియింటిలో నుంచి ♦ కొనుట తప్పు
భావింప లోకాప ♦ వాదంబు తప్ప దీ
కటిలోకంబు వా ♦ కట్టరాదు
కాన సీతాదేవిఁ ♦ గంకేళి తోఁటలో
పీటికిఁ బరగడఁ ♦ బెట్టియుంచి
రాజపుత్రికగాన ♦ రామకుం దగినట్లు
రాణివాసంబు కొ ♦ అవడకుండఁ

గాలయాపనఁ జేయఁగఁ ♦ గాపు వెట్టి
యుంతు మా త్రిజటను సీత ♦ యొద్దననుచుఁ
బండితుండైన రావణ ♦ ప్రభువరుండు
నిబ్బరించి యాత్రపడక ♦ నిర్ణయించి. ౩౩౫

సీత నశోకవనికామధ్యంబున నుంచి, తమ్ముని కుమార్తె యగు త్రిజటను గావలియుంచి యవిచారిత మనస్కుండై వీతమనశ్శల్యుండై లంకలోఁ గాలక్షేపంబుఁ జేయుచుండె. ౩౩౬

త్రిజగములెల్లఁ గెల్చి గడి ♦ దేరిన లౌకికశేఖరుండు భూ
ప్రజలకుఁగూర్చుభూవరుఁడు ♦ రావణుఁడెంత యమాయకుండొ యా
త్రిజటను నమ్మి మోసపడి ♦ దెబ్బునఁ గావలియుంచి సీతకుఁ
గజిబిజిగాఁగఁజేసికొనెఁ ♦ గా! తనలంకను తెప్పపాటులో. ౩౩౭

ఇచ్చట రామచంద్రధర ♦ ణీశుఁడు భార్యను గోలుపోయి యే
మచ్చుననేని శోకమును ♦ మానఁగలేక విషణ్ణచిత్తుఁడై
యెచ్చటఁ గాననౌనోయని ♦ యేగెను రోయుచు గాననంబులన్
బొచ్చెములేని సోదరుఁడు ♦ మూల్గుచు భక్తిని గొల్చి వెంటరా.

ఇట్లు పోయినపోకఁగాఁ బోయి యరణ్యంబులన్నియు గాలించి, వైదేహిని గానక పొగులుచున్న రామలక్ష్మణులకు, రావణునిచేఁ గూల్పంబడి కొనప్రాణములతో నున్న పితృసఖుండగు జటాయువు సీతాసమాచారంబు విన్పింపఁ దిన్నఁగా నటేగి వారిర్వురు ఋష్యమూకపర్వతంబుఁజేరి, దట్టమగు నొక్క పిప్పలిచెట్టు నీడఁబడియున్న రచ్చబండపైఁ గూర్చుండిరి. మంత్రిపరివృతుఁడై యందు సంచారంబుఁ జేయుచున్న సుగ్రీవుండు దూరముననుండి వీరింజూచి భయకంపితగాత్రుఁడై. ౩౩౮

కంటివె! యాంజనేయ! రణ ♦ కర్కశు లిర్వురు చాపధారులై
యొంటరిగాఁగఁ జెట్టుకడ ♦ నుండిరె! యేపనిఁగోరి వచ్చిరో
తుంటరు లెవ్వరేని యిటు ♦ తోడ్కొనివచ్చిరొ కీడుసేయఁగా
వెంటనె పోయి వారల ప్ర ♦ వృత్తిని నీవుగ్రహించి రాఁగదే.

బాల్యమునందు నీవు ముని ♦ పల్లెలయందు వసించి చాలఁ గౌ
శల్యముతోడుతం జదువు ♦ సాములునేరిచి యార్యభాష సా
కల్యముగా నెఱింగితివి ♦ గావున నిప్పుడు వారితోడఁ జా
పల్యములేని మాటలను ♦ బల్కి నిజంబును సంగ్రహింపుమా.

ఆర్యుల పొత్తియున్నయది ♦ యం విలుకాండ్రిమొగంబునందు నా
రార్యులె యౌదు రీక్షణము ♦ యచ్చటికిం జని యెట్టులేని నా
కార్యముదీర్పఁగాఁ దగిన ♦ గట్టుపకారసువు సందియంబులే
దార్యమనంబు నీవెఱిఁగి ♦ నట్లొరు లెవ్వ రెఱుంగలేరనన్.

జనిముదల నొదలఁదాల్తు ♦ నేనటంచు
వారి యాచారము లెఱుంగు ♦ వాఁడనంచు
గాలిగాఁబుట్టి పెఱిగిన ♦ గాలికొడుకు
గాలినడనేగె రామల ♦ క్ష్మణులకడకు. ౨౮౩

తిన్నఁగా రామలక్ష్మణులం జేరి యందందు నిలిచి వందన
బాచరించుచుఁ, దావచ్చిన పని వినయోక్తుల విన్నవించి, వారివలన సర్వంబెఱిఁగి, సుగ్రీవునితో సఖ్యంబు సమకూర్ప నిశ్చయించి, ఋష్య
మూకంబునకుఁ దోడ్కొనిపోయి, కొమ్మలరాపిడిచే నగ్నిని బుట్టించి, యగ్నిసాక్షిగా రామలక్ష్మణసుగ్రీవులకు సఖ్యంబుఁ గావించిన పిమ్మట నొండొరుల భార్యల నొకొళ్ళొకళ్ళిప్పించుకొనుటకు బాసఁజేసికొని రని సూతుం డానతీయ, దేశికేంద్రా! మీరు చెప్పిన వాక్యార్థ మ్ము బోధపడదయ్యె. విశదీకరించి చెప్పవే యనవుడు సూతమహా
యిట్లు చెప్పఁ దొడంగెను. ౨౮౪

వాలిన శక్తిచే ♦ వాలిని బడఁగూల్చి
రుమను వానరరాజ్య ♦ రమనుదెచ్చి
భద్రింబుగా రామ ♦ భద్రుండు సుగ్రీవు
నకునిచ్చి మాటఁదీ ♦ ర్చికొనుటకును
సుగ్రీవుఁ డామీఁద ♦ సుదతి సీతాదేవి
యేనాఁట నుండెనో ♦ యెఱిఁగివచ్చి
బవరంబు గావింప ♦ వచ్చినఁ గావించి
తెచ్చి శ్రీరామున ♦ కిచ్చుటకును

బాసఁజేసికొనిన పిద ♦ ప రవిసుతుఁడు
సింహనాదంబుఁ జేసి కి ♦ ష్కింధ కేగి
దురముఁజేయంగ వాలిని ♦ దోడి తేరఁ
గాంచి శ్రీరామచంద్రుండు ♦ కంపమెత్త. ౩౮౫

ఎదురై వాలిని డీకొని
కదనంబున నొడిసిపుచ్చఁ ♦ గష్టంబనుచున్
బొదమాటున బొంచి మహా
ప్రదరంబున వాలిఁ జంపి ♦ వైచినపిదపన్ ౩౮౬

రామచంద్రుండు స్వార్థప ♦ రత్వబుద్ధి
నతుల వానరరాజ్య ప ♦ ట్టాభిషిక్తుఁ
జేసె సుగ్రీవుఁ బ్రథిత కి ♦ ష్కింధ నంత
సోదరుని భార్య సుగ్రీవుఁ ♦ డుంచుకొనియె. ౩౮౭

తమ్మునిదారఁగైకొనె మ ♦ దమ్మున వాలియటంచు బాణపా
తమ్మున వానినిం దునిమి ♦ ధర్మమునిల్పెనటంద్రు మోహగీ

తమ్మున జ్యేష్ఠసోదరుని ♦ దారను దారను గొన్నఁ బక్షపా
తమ్మున సూర్యపుత్రకునిఁ ♦ దప్పన నేరకపోయె రాముఁడున్.

కృతజ్ఞుండయిన సుగ్రీవుని పంపున దశదిశలందునున్న గిరిదుర్గమారణ్యసీమలనుండి వానరులు కిష్కింధలో గుమిగూడి సీతాదేవి యున్నచోటులు గాలింపఁ బ్రయాణోన్ముఖులగుచుండ హనుమజ్జాంబవన్నలనీలమైందద్వివిదాదులు యువరాజగు నంగదుని సేనాపతిత్వముక్రింద దక్షిణదిశాభాగంబునకు బయలుదేరిరి. శ్రీరామచంద్రుం డప్పుడు హనుమంతునిం బిలిచి, కౌఁగిలించుకొని తోరంబుగా బాష్పపూరంబు లొలుకుచుండ డగ్గుత్తికతో. ౩౫౦

పండకన్నెఱుఁగని ♦ యిల్లాలు వైదేహి
కడగండ్లు పడెఁ దొల్లి ♦ కానలందుఁ
బరునింట నేరీతి ♦ బ్రదికియుండెనొకదా
యాసలన్నియు నడు ♦ గంటిపోనఁ
జిరకాల మెడబాటు ♦ చిచ్చులో మఱుఁగుచో
నిలువునఁ బ్రాణముల్ ♦ నెగిరిపోవు
నీవు నాకేకాక ♦ నిజముగా మాజాతి
కెల్ల దాసుఁడవౌట ♦ యెఱుఁగువాఁడ
ఇదిగో! ముద్దుటుంగ్రంబు నీ ♦ కిచ్చుచుంటి
నాదు క్షేమంబు నెఱిఁగించి ♦ నళిననేత్ర
కానవా లేమయిన నామె ♦ నడిగి తెమ్ము
మఱచిపోవ సాయ్యమ్ము నా ♦ మాటనమ్ము. ౩౫౧

అంచు వచియించి దుఃఖంబు ♦ నాపుకొనుచుఁ
బోయిరాఁగదే యనిచెప్ప ♦ భూవరుండు
కుప్పెగంతులు వైచుచుఁ ♦ గొంటెహనుమ
చెంగలించెను వానర ♦ సేనఁగూడి. ౩౫౨

ఇట్లు హనుమంతుం డెలగోలుపౌజుదారుఁడై నడిపింప, వానరులు చెలరేఁగి, సీతాన్వేషణార్థంబు దక్షిణదిశకు బయనించుచుండ నచ్చట లంకలో ౩౫౩

సవతాలిబిడ్డలు ♦ సైదోడులగుటచే
మనసులో విరిపోట్లు ♦ మానవయ్యె
సరమావిశాలాక్షి ♦ పరజాతి గరితౌట
ద్రవిడజాత్యభిమాన ♦ మవిసిపోయెఁ
దల్లిపోలికవచ్చెఁ ♦ దనయయౌ త్రిజటకుఁ
బెదతండ్రి యింటికిఁ ♦ బెట్టెఁ జిచ్చు
రాజ్యతృష్ణమనంబు ♦ రగిలి దహింప వి
భీషణుం డేదేని ♦ వినఁగనుండె

లంకలో గృహచ్ఛిద్రముల్ ♦ బలసె "ఇంటి
గుట్టు లంకకుఁ జేట"య్యెఁ ♦ దుట్టతుదకు
బహుళ విజయసంజాత గ ♦ ర్వంబుచేత
మదిసెఁబో రావణుండు ప్ర ♦ మత్తుఁడగుచు. ౩౫౪

లంకానగరం బిట్టి దురవస్థకు లోనగుచుండ నశోకవనికా మధ్యంబునఁ బెదతండ్రి యాజ్ఞఁ బాటించుచున్నట్లు నటించుచు.

సీతకుఁ జెంగటఁ నిలిచి ♦ చిన్నరి పొన్నరి నవ్వు నవ్వుచుఁ
జేతులు మోడ్చుచుం ద్రిజట ♦ చేయుచునుండె సపర్యలెన్నియో
యేతరినేని నామెకడ ♦ నే కనిపెట్టుకయుండి జాణయై
సీతకు నమ్మకం గలుగఁ ♦ జేసికొనెం దనయందు గట్టిగా. ౩౫౫

బెదరింపక బదులాడక
మెదలుచు మదికెక్కునట్టు ♦ మిక్కిలి భక్తిన్
దుదకొకనాఁడిట్టు త్రిజట
పదెపదె చెప్పంగఁదొడఁగె ♦ వసుధాసుతతో. ౩౫౬

పదినాళ్ళు కాలేదె ♦ పాకారిఁ దనతేరి
సుతఁగట్టి తెప్పించె ♦ సుతునితోడ
నలునాళ్ళు కాలేదె ♦ నందనోద్యానంబుఁ
జొరఁబాఱి చీకాకు ♦ పఱచివచ్చె
మూనాళ్ళు కాలేదె ♦ ముక్కంటి పడకింటి
నొక్కఁడే యుబ్బాత ♦ లూఁచివచ్చె
రెన్నాళ్ళు కాలేదె ♦ యన్నపై దండెత్తి
పుష్పకంబును జూఱఁ ♦ బుచ్చివచ్చె

తల తిరుగుచున్నదమ్మ నీ ♦ తమ్ముతల్లి!
పెద్దతండ్రి చేసెడిపనుల్ ♦ విన్నయెడల
నేమి కలదమ్మ లంకలో ♦ నిప్పుడొక్క
దినము తలలెత్తుకొని మేము ♦ తిరుగలేము.

మాజనకుండు బొత్తిగ న ♦ మాయకుఁడౌ నొరు లేవిచెప్పినన్
వ్యాజములేక నమ్మి యటు ♦ పై నగచాట్లను బొందుచుండునే
యోజన లెన్ని చెప్పినఁ బ్ర ♦ యోజనముండకపోయె, దీనతా
భాజనులన్ బొనర్చెమము ♦ "వాతలుపెట్టిన వాజమానునే".

మాపెదతల్లి సద్గుణస ♦ మన్విత యుత్తమసాధ్వి నిస్ఫుర
ద్రూపవతీలలామ యవ ♦ రోధవిభూషణ కన్నతల్లిగా
మాపయిఁ బ్రేమముంగురియు ♦ మక్కువ లోపము సుంతగా నా
దాపెయెడన్ నయంబు విన ♦ యంబునుజూపెద రెల్లవారలున్.

ఆమెపేరిమ మాకు ♦ నాటంకమయ్యెను
నామెమంచి మాకు ♦ నడ్డమయ్యె
నేమిచేయఁజాల ♦ కిట్లూరకుంటిమి
రాజ్యతృష్ణ మమ్ము ♦ రాయిడింప. ౫౬౧

శ్రీ [illegible]

౪౬ సూ త పు రా ణ ము.

ఈమాట లమృతోపమానంబుగాఁ దోప సీత విప్పారిన మోముతోఁ ద్రిజటను బరికించి చూచి సంతృప్తిఁజెందె. ౩౬౧

సరసగుణాఢ్య! మీజనని ♦ సాధుచరిత్రను జేసె మాపై యె
క్కుడుతుక నీయశోక వని ♦ కాస్థలికిం గొనితేర నామెతోఁ
బరిచయముం ఘటించుకొని ♦ వ-కొనిధర్మములెన్నియో యొడం
బఱచెదఁ దోడ్పడన్ మనకుఁ♦బైఁగనుగొందము భావిసంగతుల్. ౩౬౨

సీతమాటల నాలించి ♦ చిత్తమనుచుఁ
ద్రిజట తనతల్లిఁ దోడ్కొని ♦ తెత్తు నిప్పు
డనుచు నడుగులు లెక్కించు ♦ కొనుచుఁ జనియె
బట్టణాభిముఖంబుగా ♦ బదరి బదరి. ౩౬౩

మాపటివేళ పెన్నిరుల ♦ మాటునఁ గూఁతురు దారిత్రీయఁ నె
ట్లో పుయిలోడుచున్ సరమ ♦ యొంటి నశోకముక్రిందనున్న సీ
తాపతివత్ని చెంగటకుఁ ♦ దర్లి సుఖఁబుగఁ గూరుచుండి యే
మో పడిపోయినట్లుగను ♦ ముచ్చటలాడెను బ్రొద్దుపోవఁగన్.

కరముశిరముఁజేర్చి ♦ కరము పెరిమనంత
సరమపురమువంకఁ ♦ దఱిమి యఱుమఁ
గుంటినడకతోడఁ ♦ గొంతదూరంబేగి
త్రిజట సీతకడకుఁ ♦ దిరిగివచ్చె. ౩౬౪

కిష్కింధాపురమునుండి బయలువెడలిన కపిసైన్య సమాచారంబు నాలింపుము. ౩౬౫

హనుమంతుఁడు నడిపింపఁగ
వనచర యూథంబుఁగూడి ♦ వాలిసుతుండున్
జని దక్షిణాబ్ధి చెంతకు
వనరెఱ్ఱఁగి వననిధిదాఁట ♦ వలయునటంచున్. ౩౬౬

చాలకాలంబు మనసులోఁ ♦ జర్చఁజేసి
యూథపులకెల్లఁ జెప్పఁదా ♦ మోపమనిరి
జాంబవంతుండు ప్రేరేప ♦ సాహసించి
నడుముఁ గట్టెను సామీరి ♦ కడలిఁదాఁట. ౩౧౯

గండిచిన్నదైనఁ ♦ గప్పగంతులువైచి
గొప్పదైన నీతఁ ♦ గొట్టకొట్టి
కులికికులికి కపులు ♦ కొనియాడుచుండఁగా
లంకఁజేరెఁ బ్రొద్దు ♦ గ్రుంకువేళ. ౩౨౦

నదురుబెదురుమాని ♦ పదనుకత్తినిబూని
కన్నుమూఁతమాని ♦ కాయుచుండె
లంకగవనుముందు ♦ లంకిణి పొడగాంచి
దొంగపోటుపొడిచి ♦ ద్రుంచివైచె. ౩౨౧

సంజదాఁటిపోవ ♦ సందుగొందులుదూర
నానవాలుపట్ట ♦ నైతికాద
టంచుఁ దలఁచి పొదల ♦ యందు దాఁగుచిరులు
బయలుప్రాకునవుడు ♦ బయలుదేరి. ౩౨౨

ఈడును జోడులేనిసిరు ♦ లెల్లెడఁ గన్పడ నేత్రపర్వమై
మేడల రామణీయకత ♦ మిద్దెల సుందరతాప్రశస్తిక
న్గోడును బుట్టఁజేయఁగ ది ♦ గుల్వడి గాడుపుబిడ్డ యందుఁ గ్రీ
నీడల వంగివంగి యవ ♦ నీసుత రోయఁగఁబూనె లంకలో.

నేర్పుతో లంకగాలించి ♦ నెమకి నెమకి
సీతఁ బొడగానలేమి ని ♦ స్సీ!యటంచు
దూరముననున్న కంగేలి ♦ తోఁటకేగి
వెదకివచ్చుట మేలంచు ♦ మదిఁదలంచి. ౩౨౪

దట్టమగు తీవపందిలి ♦ నట్టనడుమ
చివురుటాకుల కంగేలి ♦ చెట్టుమొదటఁ
జెక్కిటను జేయిఁజేర్చుక ♦ చింతపడెడి
చెలియఁ బొడఁగాంచి గంతులు ♦ చెలఁగివైచి. ౩౭౫

అచ్చటికేగి మిక్కిలి ర ♦ హస్యముగాఁ దనుఁదెల్పికొంచుఁ దా
వచ్చిన కార్యముం దెలిపి ♦ భద్రముగా ముడినున్న యుంగరం
బిచ్చి శిరోవతంసము గ్ర ♦ హించి యనుజ్ఞనుబొంది వెంటనే
తచ్చన లాడియాడి వసు ♦ ధాసుతతో నిటులాడె నెమ్మదిన్.

ఎవ్వరు గానరిందు నిను ♦ నేఁ గొనిపోవఁగ నేర్తుఁ దల్లిరో!
జివ్వన సబ్ధిదాఁటి రఘు ♦ శేఖరుముంగలఁ బెట్టఁగల్గుదున్ .
నెవ్వగలెల్ల మాని యవ ♦ నీపతి రంజిలనంచుఁ జెప్పఁగా
నవ్వుచు సీతపల్కెఁ దన ♦ నాథుని మర్మము విప్పిచెప్పుచున్.

నిజముగ నన్ను రావణుఁడు ♦ నిబ్బరికింపక మోహవిష్టుఁడై
యజమున జుల్మచేసి గది ♦ యం దమకింపఁగ తెప్పపాటుకూ
డ జమక కొంటిపాటున ని ♦ టన్ నిలువంగను నోపుదాననే
రజనిచరాంగనల్ సలుపు ♦ అద్దిని రవ్వను జూచుచుండియున్.

బంగరులేడి నాపతిని ♦ వంచనసేయఁగ దూరమేగినన్
దొంగిలి రావణుండు ననుఁ ♦ దోడ్కొనివచ్చిన మాటకల్ల యే
భంగపడంగలేదు పొఅ ♦ పాటున మేమఖిలంబెఱింగియే
దొంగిల వీలుచూపితిమి ♦ తోడ్కొనిపోవఁగఁ గార్యసిద్ధికై.

కావున ఘోరయుద్ధమున ♦ గండడగించుట యొండె మాయచే
ద్రావిడపాళినింగలఁచి ♦ దాస్యమునందునఁ జొన్పి వెంటనే
పావనమైన యార్య పరి ♦ పాలనమున్ నెలకొల్పుటొండె వే
జేవియు మాకునచ్చవు స ♦ రే! చెవికెక్కవు మారుతాత్మజా.

కాన సీతోడ వచ్చుట ♦ జేనికడకుఁ
బోలదిప్పుడు పనిఁ జెడి ♦ పోవు దాన
నీవు నమ్మినబంటువౌ ♦ టెఱుఁగుదాన
నంచు సొగసుగ సీత మా ♦ టాడినంత. ౩౮౧

సీతాదేవికి జోతలు
చేతులు జోడించిపెట్టి ♦ చిత్తంబనుచున్
నాతల్లీ! పోయెదనని
వాతూల కుమారకుండు ♦ పయనంబగుచున్. ౩౮౨

కొంతవడిఁబోయి రావణ ♦ కులనాథుఁ
గాంచిపోవుట యుత్తమ ♦ కార్యమనుచు
బాహుసంపదఁ జూపింప ♦ భావ్యమనుచు
క్షణములో మేనువెంచి యు ♦ త్సాహగరిమ. ౩౮౩

గురుతరవృక్షముల్ విఱిగి ♦ కూలఁగఁదన్నుచుఁ బెద్దకొమ్మలన్
విఱుచుచు వేఁగ నేలఁ బడ ♦ వేయుచుఁ గూఁకటివ్రేళ్ళతో సగా
పరిఁ దలక్రిందుచేయుచుఁ గు ♦ జంబులఁగొన్నిటిఁ బెచ్చు రేఁగఁగా
పరు లరుదేర వారలను ♦ బాది గతాసులఁ జేసినైచుకున్. ౩౮౪

అక్షయుఁడువచ్చి క్రొవ్వాఁడి ♦ యుంపగమిని
నాంజనేయుపైఁ బరగించి ♦ యతులశక్తిఁ
బిరుతివియ కట్టె పోరాడి ♦ వీఁగి తుదకు
వీరశయనంబు బొందెను ♦ విధివశమున. ౩౮౫

ఇంద్రజిత్తు జిత్తులమారి ♦ యేగుదెంచి
సునిశితాస్త్రంబులను వైవ ♦ సొమ్మసిల్లఁ
బట్టి హనుమంతుఁ గొనిపోయి ♦ భక్తితోడ
నప్పగించెను దండ్రి యా ♦ రా! యనంగ. ౩౮౬

హనుమంతుండును రావణుఁ జూచి చూచుటతోడనే మనంబులో నిట్లు తలపోయఁజొచ్చెను.

వీఁడటే రోరాయు ♦ వీడటే చొరఁబాఱి
కైకొన్నవాఁడటే ♦ గాలికలము
వీఁడటే ముక్కంటి ♦ వీడటే పైకెత్తి
క్రొండాడినాఁడటే ♦ కొండవిడు
వీఁడటే నాఁడటే ♦ వెట్టివారలఁజేసి
పీడించినాఁడటే ♦ వేల్పుమూఁక
వీఁడటే కొడుకుచేఁ ♦ బెడతెక్కలనుగట్టి
తెప్పించినాఁడటే ♦ దివిజనాథు

వీఁడటే తనవీడిడు ♦ జోడుజాడ
లేనిదానిఁగాఁ జేసిన ♦ మానఘనుఁడు
చేతులనునెత్తి జోహారు ♦ సేయుతలఁపు
పుట్టుచుండె నిప్పుడు త్రాటఁ ♦ గట్టఁబడిన. ౩౮౮

అవుర! యింత తేజశ్శాలి ♦ యగుటచేత
నే త్రిలోకంబు లరికట్టి ♦ నిల్పనేర్చెఁ
దెగువఁజూపించి, యెల్లెడఁ ♦ దిరుగనేర్చె
వీనిజన్మంబు ధన్యంబు ♦ పృథ్విలోన. ౩౮౯

హనుమంతుఁ డిట్లు విచారించుచుండఁ బ్రతాపలంకేశ్వరుండయిన రావణుండు. ౩౯౦

పట్టువడినట్టి పగవానిఁ ♦ బాఱఁజూచి
కొలువులోన శిక్షించుట ♦ కూడదనుచు
మంత్రివర్గంబుఁ బిలిపించి ♦ మంత్రివేత్త
తత్క్షణమ కొల్వుసేయ సి ♦ ద్ధపడుచుండ. ౩౯౧

విభీషణుండు పుత్రికాముఖంబున నీయుదంతంబాతయు నెఱింగి యేపన్నుగడనైన నాంజనేయుని శిక్షఁ దప్పించుట స్వార్థంబునకు మిగుల ననుకూలించునని యెంచి, యత్యుత్సాహంబుతో నొడ్డోలగంబునకు నేగి యందు మరణదండన యొక్కటియే సముచితంబగు శిక్షయని జరుగుచున్న చర్చ నాలించి వారించి యగ్రజు నుద్దేశించి.

దూతయవధ్యుఁ డాతనిని ♦ ద్రుంచుట ధర్మముకాదు సోదరా!
నీతిదొరంగి యీవిధము ♦ నీయటువంటి మహానుభావుఁడే
దూతను జంపుచో జగము ♦ దూరదె ధర్మవినాశమంచు; నీ
వీతనిఁ జంపమాని యెది ♦ యేనొకశిక్ష విధించి పంపుమా.

దూతను బరిమార్చినచో
బ్రాతిఁబరస్పరము రాయ ♦ బారములెటులన్
భూతల పతులకు నడచును?
దూతల వధియింపఁదగదు ♦ దొరలకు నెందున్. ౩౯౪

దూత దుండగీడైనచోఁ ♦ దోటుపడక
యంగవైకల్య మొనరింప ♦ నగునుగాన
వీనిమొలచుట్టుఁ గడు బ్రాఁత ♦ పేలికలను
గూర్చి కొఱవినిప్పుఁగొని దా ♦ కొల్పుమన్న. ౩౯౫

లెస్సయని రావణుం డట్టు ♦ లే యొనర్పఁ
దంచుఁ గొలువుకూటమువీడి ♦ యరిగెఁ దోక
చుట్టి కట్టెల్ల నిప్పాది ♦ పెట్టి సాఁగ
నంప నాంజనేయుఁడు దెస ♦ లద్రువనార్చి. ౩౯౬

గుప్పుగుప్పున మంటలు ♦ గప్పుచున్న
తోఁకచిచ్చు లంకాపురీ ♦ దుర్గమునకుఁ

దోఁకచుక్కయ్యె నిల్లిల్లు ♦ దూరి నిప్పు
వెట్ట లంకెల్ల బూడిద ♦ గుట్టయయ్యె. ౩౯౯

వననిధిదాఁటి వాయుజుఁడు ♦ వాలిసుతాదులఁగూడి రామభ
ద్రునికడకేగి సీత దయ ♦ తోడనొసంగిన మస్తభూషణం
బునొసఁగి సర్వముందెలుప ♦ బోరననేడిచి కొంతసేపు వెం
టనెముదలిచ్చెసైన్యముహు ♦ టాహుటిఁదిన్నఁగఁబోవ లంకకున్.

దూతయెవండో! యేప్రభువు ♦ దూతగ నీహనుమానునంపెనో!
సీతను జూచిరమ్మనుచుఁ ♦ జెప్పెనుగాని రఘూద్వహుండొగిన్
దూతఁగఁబోయి రావణుని ♦ తోఁ దగురీతిని రాయబారమున్
బ్రాతిగ నడ్పిరమ్మనుచుఁ ♦ బంపెనె? రాఘవుఁ డెంతమోసమో!

దూతయగువాఁడు లంకిణిఁ ♦ ద్రుంపనేల?
రాత్రి పురిమాటుచేల? ధ ♦ రాజతోడ
మాటలేల? వనమునెల్ల ♦ మాపుచేల?
యక్షునాదివీరులఁ దెగ ♦ టార్చుచేల? ౪౦౦

కలదొక్క ధర్మసూక్ష్మము
వలఁతులు తొల్లింటి పెద్ద ♦ వారలు మతిమం
తులు తెలిసి కప్పిపుచ్చిరి
తెలిపెద నిపు డద్దినీకుఁ ♦ జెల్లముగాఁగన్ ౪౦౧

దూతదూతయంచుఁ ♦ దొందఱగాఁ జెప్పి
దూతఁ జంపునెడల ♦ దోసమంచు
బంకుబొంకుబొంక ♦ వంక తెలియలేక
బ్రమసి మోసపడియె ♦ రావణుండు. ౪౦౨

అట కిష్కింధాపురిలోఁ
బటుతర సుగ్రీవునాజ్ఞఁ ♦ బాటించుచు మ

కూటసైన్యము లతిరభసో
త్కటముగ లంకానగరికిఁ ♦ గదలఁగసాఁగెన్. ౮౦

వానరవాహినీపతు ల ♦ పారబలంబులతోడ వచ్చుచుం
బ్రాణములొడ్డి సీతఁ గొని ♦ వత్తుమటంచును గ్రిమ్మలాపము
గానలనుండి కైకొనిస ♦ కమ్మనిపండుల నారగించుచున్
బైనముకాఁగ రాఘవులు ♦ వానరనాథునితోడ వెంటనే. ౮౧

కోలాహలముం జేయుచు
గోలాంగూలములునడువఁ ♦ గోయని ధరణీ
పాలసుతులు సుగ్రీవుని
కేలూనుచు నడచిరంత ♦ కేరింతలతో. ౮౨

వారము లెన్నియో కడవ ♦ వానరులంగొని దక్షిణాంబుధిం
జేరి మహాసముద్రమిది ♦ సేన లపారము లెట్లు దీనినే
ర్పారఁ దరింపఁగల్గుదుమొ ♦ యంచు విభాకరపుత్రుఁగూడి సా
మీరినిబిల్చి యంతసము ♦ మిక్కిలి చేయుచునుండ నచ్చటన్.

రాఘవుఁ డబ్ధికావలను ♦ రాణువతో దిగియున్నవార్తనున్
వేగులవారిచేఁ దెలిసి ♦ వేగమ రావణుఁ డాప్తమంత్రులన్
వేగురు దండనాయకులఁ ♦ బిల్చి సమస్తముఁ దెల్పి కర్జమున్
బాగుగ నిర్ధరింపుఁడని ♦ పల్కె నిజస్థితి నిండుకొల్వులో. ౮౩

ఎటులో విభీషణుండెఱిఁగి ♦ యాసభసంగతి యప్పుడప్పు డే
కటఁదోడిపూసికట్టి యొడి ♦ కంబుగఁ గొల్వుకుజేరి యందు నొ
క్కట నుపవిష్టుఁడై సరిగఁ ♦ గన్గొనుచుండి సభావిశేషముల్
చిటుకున బూటకీడగుచుఁ ♦ జిత్తములోఁ దలపోసె నీగతిన్.

ఇదె సమయంబువచ్చె నెది ♦ యెట్లయినన్ బదులాడియున్నఁ
బదెపదె తిట్టులందిని స ♦ భాస్థలి లోకులు బ్రువ్వఁదిట్టఁ ది

స్పీదమును నన్ను నెత్తిపయిఁ ♦ బెట్టి పురిందిగఁ బెట్టి రామభూ
మిదయితు పాదపద్మముల ♦ మీఁదనువ్రాలి నమస్కరించెదన్.

ఈయుపాయంబుచే నిప్పు ♦ డేయపాయ
మెనయకుండఁ బడసెద న ♦ భీష్టసిద్ధి
యంచు నొడ్డోలగంబు వీ ♦ క్షించి యిట్లు
పాపభీతిఁ బొరయకుండ ♦ వక్కణించె. ౪౧౦

సీతను బట్టితెచ్చి వన ♦ సీమను బెట్టిన నాఁటఁగోలె నేఁ
జూతుఁ బురంబునందుఁ బలు ♦ చోటుల దుశ్శకునంబులెన్నియో
భీతి మునింగియుండె బ్రజ ♦ బెళ్కురె నేమియుఁ దోఁచకున్న మీ
రీతరి సంధిసేయ నళి ♦ యింపక నిల్చును లంక యగ్రజా! ౪౧౧

రాముఁడు గుణాభిరాముఁడు
తామసిగాఁడు శరణంబు ♦ తప్పకయిచ్చున్
గామిడి మూఁకల మాటల
కేమీ? చెప్పెదరు వార ♦ లేమయినసరే. ౪౧౨

శూర్పణఖ తెచ్చిపెట్టె నీ ♦ సూడు, సోడు
ముట్ట లంకనెల్ల నిపుడు ♦ చుట్టఁబెట్టి
కాల్చివేయంగ నుండె, నే ♦ కరణినేని
మీరుదప్పింపవలయు సు ♦ మ్మోయటన్న. ౪౧౩

పండ్లు పటపటగొఱుకుచుఁ ♦ గండ్లుఱుముచు
నట్టహాసంబుఁ గావించి ♦ కట్టలుకను
సోదరుం డిట్టు మాటాడఁ ♦ జొచ్చెనకట
యంచుఁ జిఱ్ఱుబుఱ్ఱాడి లం ♦ కాధివిభుఁడు. ౪౧౪

అభిజనుఁ డెవ్వఁడేని యిటు ♦ లాడునె దుస్సహజాతివైరినే
యభయముఁగోరుమంచు నక ♦ టా! సభలోపల? వీఁడుతమ్ముఁడా

యుభయకులంబులుఁ జెఱుప • నుద్భవమందిన వాఁడు గాక, పా
పభయముఁదక్కి నే వెడలఁ • బంపెదఁ ద్రోహిన స్నేహవల్లికన్.

తమ్ముఁడటంచు వీఁడు పెడ • దారులఁ గ్రుమ్మరుచున్నఁ జూచియున్
గిమ్మన కూరకుంటి నదె • కీడయి యింతకుఁదెచ్చె నౌర! నా
సమ్ముఖమందె నిట్టుల న • సహ్యపుమాటలఁ బల్కుచుండె నే
నెమ్మెయి వీనిఁబట్టి క్షమి • యింపఁగనేర్తును మాటిమాటికిన్?

జాతిపౌరుషంబు • జాత్యభిమానంబు
జాతిగౌరవంబు • జాతిపరువు
వీనియందు లేవు • వీఁడెట్టు పుట్టెనో!
తుక్కమూతిపిందె • కులముచెడఁగ. ౪౧౭

ఇంతలోన విభీషణుఁ • డేమియన్న!
తగవులాడకు మీయెడఁ • దప్పుమీది
సీత నర్పించి శరణంబుఁ • జెందు రాముఁ
డతిదయాళువుగాన ని • న్నాదరించు. ౪౧౮

శూర్పణఖ బన్నమొల్లఁ బో • కార్పనెంచి
యఖిలకులమును నీవు పో • కార్పవలదు
శరణమనకున్న నాత్మనా • శంబుగల్గు
శంకవలదన్న రావణుఁ • డంకపడుచు. ౪౧౯

బ్రదికినన్నినాళ్లు • రావణక్ష్మాపతి
పౌరుషంబుతోడ • బ్రదికెననఁగ
సర్వనాశమైన • జాతిప్రతిష్ఠను
గాచువాఁడు రిపుల • నేఁచువాఁడు. ౪౨౦

"పరదారాగర్భనిర్భేదనచణధనుర్జ్యావల్లీకిణాంకితములైన యీ హస్తములు, నిరంతర నవకోటిశివాలయార్చా పవిత్రీకృతములయిన

యీహస్తములు, ధర్మపీడాపరాయణకంఠలుంఠనపటిష్ఠద్రాఘిష్ఠఖడ్గ పుంఖరత్నప్రభారింఛోళీవిభ్రాజితంబులయిన యీ హస్తములు సంతత దానజలధారాపరిప్లుతములయిన, యీ హస్తములు, నీచమానవునకు, జాతివైరికి, హతభాగ్యునకుఁ గైవారంబుసేయునా? ఓరీపాపీ! ఓరీ కుల ద్రోహీ" యంచు. ౪౬౧

బెట్టిదంబుగ నజుకాలఁ ♦ బెట్టితన్నఁ
గ్రిందపడి గద్దెపైనుండి ♦ కిదికిలేచి
తలపులీడేర నని పొంగి ♦ కొలువువదలి
క్రొవ్వుమాటలు తెగఁబడి ♦ కొన్నిపల్కి. ౪౬౨

నలుగురు మంత్రులంగలిసి ♦ నక్కి విభీషణుఁ డప్డె యబ్ధి యీ
వలఁగల రామచంద్రు పద ♦ పద్మయుగంబున వ్రాలి దీనుఁడై
గిలి నభయంబువేడఁగ నొ ♦ గిన్ హనుమంతుని మాటమీఁద నె
చ్చెలిగ గ్రహించి రాముఁ డభి ♦ షిక్తునిగానొనరించె లంకకున్.

పిదప విభీషణుండు తన ♦ ప్రెగ్గడలం బురికొల్పి మంత్రమె
ల్లఁదెలిసి వేగ రండనుచు ♦ లంకకుఁబంపఁగ వారు తోడుతోఁ
గదలి పురంబుఁజేరి యటఁ ♦ గల్గు రహస్యము లాకలింపుచున్
బదపడి దాఁచకుండ రఘు ♦ పర్యునికిన్ వినిపించి రంతటన్.

ద్రావిడ శిల్పియౌ నలుఁడు ♦ రామునిపంపున గండ్లుపూడ్చి త
జ్జీవనధిన్ దరించుటకు ♦ సేతువుగట్టఁగ నబ్ధిదాఁటి సీ
తావిభుఁడా సువేలమున ♦ దండును డించుచు రాయబారిగా
రావణు చెంతకంపె యువ ♦ రాజగు నంగదు సంధిసేయఁగా.

రాయబారంబు చెడిపోయె ♦ రావణుండు
స్వాభిజాత్యంబు విడనాడి ♦ సంధిసేయ

నోడఁబడకపోవ నాముచే ♦ యుద్ధభేరి
మొరసెఁ గోలాహలము మిన్ను ♦ ముట్టుచుండ. ౮౭

సాధకుడుర లేదనుమాట ♦ సరమ చెప్ప
సీత వెరడించి కూర్చుండి ♦ చెట్టుక్రిందఁ
గడకుఁ గానున్న దేదియో ♦ కాకమాన
దైన నొకమాట నాలింపు ♦ మనుచు వేడె. ౮౮

గుప్తికర్మమెట్లు ♦ కొనసాఁగుచుండెనో!
మంత్రనిశ్చయంబు ♦ మాటయేమొ!
తెలిసివచ్చి తేట ♦ తెల్లంబుగాఁ జెప్పు
సరమతల్లి! నిన్ను ♦ మఱవననిన. ౮౯

సరమ పురంబుఁ జేరి పటు ♦ శక్తి రహస్యములన్ గ్రహించుచున్
సరగునవచ్చి మైథిలికి ♦ సంగతులన్నియుఁ జెప్పఁగాఁ బ్రభా
కరకులహేళికిం గబురు ♦ గ్రక్కునఁ బంపె యథోచితంబుగా
మఱగుచునుండె నేమగునొ ♦ మంపిలు యుద్ధమటంచు నెమ్మదిన్.

ఇరువాఁగులు పోరితమున కాయిత్తమై మహాదారుణరణంబు ప్రారంభింపఁ బెడబొబ్బలు, పెడనవ్వులు, కనకతప్పెటల మ్రోఁతలు, యేనుఁగుల గీపెట్టులు, జక్కుల సకిలింపులతో నిలాతలంబు దద్దరిల్ల, రోదసీగహ్వరంబు తూఁటుగట్టఁ జావునకుఁ దెగించి, కనుఱెప్పపాటులోఁ బోరుముగించుటకోయన, వీరరసావేశంబుతో, నట్టహాసంబుతో, నవష్టంభంబుతో దొమ్మినడుప మోటునాటుల పోటుధాటికి నిశాటులు లోఁదుగ, నింద్రజిత్తు సూరెలనిల్చి, కోఁతులఁ జేయుచుఁ జెలరేఁగి కొంతవడి యుద్ధంబుఁ జేసి, కార్యంబు సుకరంబుగా సాధించుటకు, యజ్ఞదత్తంబులయిన రథాశ్వంబు లుండుట సముచితంబని యెంచి రణవిముఖుండై, వీడువొచ్చి, నికుంభిలయందు హోమముసుఁ జేయసాఁగెన్.

ఈసమాచారంబు చారులవలన నెఱింగి విభీషణుండు వెంటనే రాము నకు విన్నవించెను. శ్రీరాముండులక్ష్మణకుమారునిససైన్యంబుగాఁబంప నంపు మేఘనాథునియునికి యెఱుంగనేరక తహతహపడుచుండ.

అతిరాజ్యతృష్ణచే ♦ నడియాస పాల్పడి
జాతివిరోధి నే ♦ స్తంబుసల్పి
కన్నకూతురఁ జేసి ♦ కొన్న నాతినిగూడ
లంకలోదిగఁబెట్టి ♦ శంకలేక
పగవాని శరణంచుఁ ♦ బజ్జఁజేరి కులంబు
కూఁకటివేర్లతోఁ ♦ గూల్పనన్న
తనయాలుబిడ్డల ♦ ననుకంప నిరతంబు
కంటిఱెప్పవిధానఁ ♦ గాచుచున్న

సోదరుని బిడ్డయని జాలి ♦ చూపకుండ
లక్ష్మణునకుఁజూపె నికుంభి ♦ లఁ జలపట్టి
పరమభాగవతోత్తమ ♦ వరుఁడుకాఁడె
విమలచరితుండుకాఁడె వి ♦ భీషణుండు. ౪౩౧

సరమాసతీవిభుం డీ
శరణిని లక్ష్మణున కచటఁ ♦ గన్పఱపంగా
శరపాళిని నిగుడించుచుఁ
బరిమార్చెను మేఘనాథుఁ ♦ బటుతరశక్తిన్. ౪౩౨

జ్యేష్ఠపుత్రుని మరణంబు ♦ చెవినిబడిన
రావణుండు శోకవిహ్వల ♦ భావమునను
గొంతసేపూరకుండి స ♦ క్రోధుఁడగుచు
శత్రుమారణోపాయంబు ♦ సంస్మరించి. ౪౩౩

పాతాళహోమంబుఁ ♦ బరిపాటిఁ జేసి
లబ్ధదోస్సారుఁడై ♦ లావుతో మెఱసి
జయలక్ష్మి కై దండ ♦ చనువుతోఁ బట్టి
యేపార రావణుం ♦ డెదనిశ్చయించి
మఱువున నొకచోట ♦ మంత్రులతోడ
నొక్కఁడే పాతాళ ♦ హోమంబుఁ జేయ
నల విభీషణుఁ డంత ♦ యాత్రంబుతోడ
శ్రీరామునకుఁ జెప్పి ♦ సిబ్బితిలేక
యంగదాదులఁ బంపె ♦ నా హోమవిఘ్న
మాచరింపఁగ వార ♦ లంతటఁ బోయి
[illegible]జేసు జాడలు ♦ తెలియఁగాలేక
మల్లాడుచుండంగ ♦ మతిమాలి సరమ
వీక్షించి వెంటనే ♦ వ్రేలితోఁ జూప
నంగదుఁ డచ్చోట ♦ కలితంద్రిఁ బోయి
పెనుగొండ కైవడి ♦ పీటపైనుండి
యగ్నిహోత్రము వేల్చు ♦ నచలసమానుఁ
లంకాధినాథు వి ♦ లక్షణుఁ జూచి
జన్నంబు మాన్పింపఁ ♦ జాలఁగాలేక
యవరోధ మెదిలేక ♦ యవరోధ మేగి
చెక్కునఁ జెయిఁ జేర్చి ♦ చింతిల్లుచున్న
మండోదరినిగాంచి ♦ మాటాడకుండ
ముత్యాల చేర్చుక్క ♦ పుడమిపై రాల
జారుక్రొవ్వొదఁ బట్టి ♦ చరచరలాఁగి
రాజవీథులగుండ ♦ రమణిఁ దోడ్తేర
వీక్షించి యేరాలు ♦ వెడనవ్వు నవ్వ
రాక్షసేశ్వరుముందు ♦ రామను నిల్ప

నామె విలాపంబు ♦ నాలించి రావ
ణుం డాగ్రహోదగ్ర ♦ మండితుండగుచు
యువరాజు నెదురొమ్ము ♦ నొకతన్నుఁదన్ని
యర్ధాంగి విడిపింప ♦ నాతండు పర్వె. ౪౩౪

ఏర్చు పరాభవాగ్నిఁ దపి ♦ యించుచుఁగుందుచునన్న భార్య నో
దార్చి విరోధివర్గమును ♦ దండడి దొందడిఁజేసి వారిఁబో
కార్చి జయంబుఁదెత్తునని ♦ గ్రక్కున దేరును నెక్కిపోయి బా
ణార్చుల కారుచిచ్చు బయ ♦ లంతయుఁ బ్రాకఁగఁ జేసె నం[illegible].

పడరాని యవమాన ♦ బాధ లంకేశుండు
సీతాపహరణంబుఁ ♦ జేసి పిదప
బహుళ సాంద్రాశోక ♦ వనములోఁ గూర్చుండఁ
బెట్టఁగా హాయిగాఁ ♦ జెట్టునీడ
రావణుంజెంత దు ♦ ర్మార్గుఁ డౌరా! యంచు
శ్రీరాముఁ డెల్లెత్తి ♦ చెప్పుచుండె
సుశ్లోకవతి దివ్య ♦ సుగుణాఢ్య పతివత్ని
మండోదరిని మోటు ♦ మర్కటుండు

రాణివాసంబుఁ జొచ్చి దు ♦ ర్మదముతోడఁ
గొప్పవట్టీడ్వ వీధుల ♦ గుండ నౌర!
మైథిలీభర్త పల్లెత్తు ♦ మాటయైన
చెప్పనంగ లేదెటువంటి ♦ ధార్మికుండొ! ౪౩౫

అసలు నూఱేండ్లు దాఁటిన ♦ ముసలియయ్యు
గుడుసువడుచుండఁ జాపంబు ♦ గడుసువడుచు
వెలితియగుచుండఁ గవదొనల్ ♦ వెలితిపడక
పోరుసాగింప రావణ ♦ భూవరుండు. ౪౩౬

ధరణిఁ బుట్టుట గిట్టుట • కొఱకుఁగాదె
యెప్పుడో యొకప్పుడు చావు • తప్పఁబోదు
జాతి యభివృద్ధికొఱకునై • సమసిపోయె
రావణుం డెంతధన్యుఁడో • పతిథనభూమి. ౭౭౮

విధవయైన లంకాపురి • సధవఁజేసి
సీత నగ్నిలోపలఁ బ్రవే • శింపఁజేసి
మరలఁ గొనుచు నయోధ్యకు • మరలివచ్చె
వానరులతోడ రాముఁడు • వైభవమున. ౭౭౯

భార్యఁగొంపోవఁగ విరోధి, • వానరులను
జేరి శరణంచుఁ బగవాని • జంచి భార్యఁ
దెచ్చికొన్న రాముఁడు కీర్తిఁ • దెచ్చికొనియె
వసుధ నెవరి యదృష్ట మె • వ్వరికివచ్చు. ౭౮౦

# ముగింపు.

నాఁటికిఁ గథాశ్రవణంబు చాలించి, సంధ్యావందనాదులుసల్పి యారేయి నిదురించి, యుషఃకాలంబునఁ దత్తరపడిలేచి, కాల్యంబులఁ దీర్చికొని, గురువరుండగు సూతమహర్షిం జేరి వందనం బాచరించి.

కడచినరేయి నొక్కొకలఁ • గంటెని మూదగు కమ్మనాఁటిలో
గడబిడలేవొ కల్గి కడ • గండ్లగచాట్లు ప్రజాసమూహమున్
సుఖపులు పెట్టిపెట్టి పరి • శోషణఁజేయుచు నుండెనంచు న
క్కడ కిపుడేగిచూచి యటఁ • గాంచిన సంగతులన్ని చెప్పెదన్.

బుద్ధిపుట్టెను మాయూరు • పోయివత్తుఁ
జుట్టపక్కాల నెల్లరఁ • జూచివత్తు

దేశికేంద్ర! రెన్నెల్లలోఁ ♦ దిరిగివత్తు
గొఱితవడ్డ ధర్మంబుల ♦ నెఱుఁగుకొఱకు. ౪౫౩

ఎల్లకాల మెల్ల ♦ నృత్తంబు లెఱుగుదు
రైనఁ గన్నులార ♦ నేనుచూచి
మీకు విన్నవింతు ♦ నాకడకథలెల్లఁ
దప్పుపట్టవద్దు ♦ తండ్రి! నన్ను. ౪౫౪

అన విని మౌనిచంద్రుఁడు ర ♦ యంబున లేచుచు నొక్క యోషధిన్
గొని యరుదెంచి చూడుమిది ♦ గో! యపురూపపు మందు టాకు దీ
నిని నఱకాలఁ బ్రాముసెడ ♦ నింగినిబోయెద వెంతదూరమై
నను గను తెప్పపాటునన ♦ నన్ విని మిక్కిలి యాదరంబునన్.

బిక్కమొగమునఁ మునినాథు ♦ చక్కచూచి
యేమితోఁచక కూర్చుండి ♦ యించుకంత
పైన మప్పుడే నిశ్చయ ♦ పఱచి నేను
యోగవాగలు సంచిలో ♦ నుంచికొనుచు. ౪౫౬

పాదలేపనంబుఁ ♦ బట్టింప నఱకాల
మింటికెగసి నాడ ♦ మంటినుండి
తెల్లవారలేదు ♦ దిగినాఁడ మాయూరి
చెఱువుగట్టుమీఁది ♦ చెట్టుక్రింద. ౪౫౭

ఈకథ వ్రాసిన విన్నను
వాకొన్నను బాడిపంట ♦ పరువముసుబ్బున్
తేకువ జోకయుఁ బ్రిబ్బున్
బాగ్రికటముగ లిబ్బులుబ్బుఁ ♦ బైరములిబ్బున్. ౪౫౮

తృతీయాశ్వాసము

సంపూర్ణము.





# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA125B182 |
| పుస్తకం పేరు | సూత పురాణము 03 |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 129 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Ruksana |
| పేజీలు విడదీసినది | Ruksana |
| స్కాన్ చేసినది | Ch. Ramya |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | [illegible] |